శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# లంకాదహనము

అను

# విభీషణపట్టాభిషేకము

## ప్రథమాంకము

ప్రదేశము—పర్ణశాల

[రాముఁడు, లక్ష్మణుఁడు, సీత, ప్రవేశించుట]

సీత:—ప్రాణేశ్వరా! మీ కిట్లు వనవాసము పాడియగునా? ఈవన వాసమె నా కెంతయు నానందకరముగ నున్నది. ఏమందురా?

(1వ అనుబంధము)

ఉ. బంగరు మేడ లేల? మణి। భూషణ లేలను? సౌఖ్యమబ్బునే
కౌఁగిలిఁ జేర్చి సదా మదికి। వేడ్కను గూర్చెడు కాంతుఁ బాసి యే
యంగన లెంచఁజాలుదురు। యక్కట! సంపద లాసఁ జేసి యీ
భంగిని పల్కఁజెల్లునె?। భాగ్యము లేటికి నాథు వీడినన్

పతివ్రతల క్షణభంగురంబులగు తుచ్ఛసుఖము లెన్నటికిని సంతససౌఖ్యములఁ గూర్పఁజాలవు

రాము:—కాంతారత్నమా! నీయట్టి సుగుణాలంకారిణియగు వనితను జేపట్టినందున కే నెంతయు ధన్యుఁడనుగదా! ఏమైననేమి? సౌధాంతరసీమలఁ గాలముఁ బుచ్చుచు, సుఖపరంపరలఁ దులతూఁగు నిన్నుకారణముగఁ గఠినశిలావృతంబును, క్రూరమృగనివాసయోగ్యంబు

భగు నీఘోరావనులఁ ద్రిప్పుచుంటినిగదా. ఇంతకును ధాతాజ్ఞమీరి ప్రవర్తింప నేరికి సాధ్యమగును.

సీత:—నాథా! ఏనుమీకంటె నెక్కుడుసుకుమారినా? రాజాధిరాజనకుఁబుత్రులై, యపారసంతత సౌఖ్యము లనుభవించుచు నవరత్నఖచితమై యొప్పుసౌధముల వసించు మీరలు వనవాస శ్రమ కోర్చియుండుటలేదా? ఇదియుఁగాక కంటికి ఱెప్పవలెఁ గాచుచు మీరు దరినుండ నాకిసుమంతయైన విచారము కలుగు నా? ఆసౌఖ్యము చేకూరునా?

రాము:—తన్వీ! నీపల్కులు సత్యములే యగును. కాని, నా కొక సంశయము కలదు.

సీత:—ఏమది?

రాము:—ఇన్నినీతుల నెఱింగిన నీవు పతివ్రతాధర్మమును దాఁటలేదా?

గీ. ధవునిపల్కుల జవదాఁటి । తనుఁ దాను
పంతగించుట చెల్లునే । భావ్య మగునె?
చెప్పవశమౌను నీతులఁ । జేయుటగును
మనసువచ్చినరీతిని । మసలు మంద్రము.

సీత:—(సిగ్గునఁ దల వంచుకొనును)

రాము:—సిగ్గునందుచుంటివేల?

సీత:—ఏసల్లందుకుఁ గోరియుంటినో. తెలిసియు నిట్లనుడివిన నేమనుదాన?

రాము:—ఓహో! అంతియుఁ బ్రేమయే కాఁబోలును.

[ప్రవేశము:—లక్ష్మణుఁడు]

రాము:—తమ్ముఁడా! ఇంతదనుక నెచ్చోటనుంటివి?

లక్ష్మ:—ఫలములకై పోయి కొనివచ్చితిని.

రాము:—నీ మోమెంతగ వాడియున్నది!

## ప్ర థ మాం క ము

చ. వనముల సంచరించు పతి । భారముకాదొకో సోదరా! వదిన్
మనమున శంక నందకిటు । మానక వెంటను వేగుదెంచితే
కనియు నెఱుంగ వెన్నఁడును । కాననసీమలఁ బొందుకష్టముల్
అనయము నిద్రహారముల । నంటక నెట్టుల వెళ్ళఁబుచ్చెదో?

లక్ష్మ:—సోదరా! నాకై మీ రిసుమంతయుఁ జింతనందవలదు. నాకేమియు శ్రమ యని తోఁచుటలేదు. నిరతము మీ పాదసేవకన్న వలయు భాగ్యమేమి? ఇదియే నాకు సర్వార్థసిద్ధిదాయకము.

రాము:—లక్ష్మణా! ఆహా! సహోదరునియందు నీకుఁగల యభిమానమపారముకదా. నిక్కముగ నీవు నాదరిని లేకున్న నే నిట్లుకాలమును గడుపుట దుర్లభముసుమా.

సీత:—మఱఁది! లక్ష్మణా! మాకై మెట్టియిడుమలఁబడుచుంటివి!

లక్ష్మ:—అమ్మా! మీ రిట్లనుట న్యాయమగునా?

(2 వ అనుబంధము)

సీత:—(ఆతురతతో) నాథా! నాథా! ఇదిగో చూడుడు. ఆహా! ఏమిసౌందర్యము! బంగరువన్నె-కాదు-కాదు-నిక్కముగ దాని శరీరమంతయు బంగరుచేతనే నిర్మింపఁబడినది. ప్రాణేశ్వరా! ఆ కురంగమును బట్టియిచ్చెదరా?

రాము:—(పరికించుచు) ప్రేయసీ! ఇదెంతయు నాశ్చర్యముగనున్నది.

ఉ. కన్నులఁ గాంచ మెన్నఁడును । కాంతరో! యిట్టికురంగ మీభువిన్
నున్నదటంచు వించ మెవ్వ । మానాల్పైననను దానవేయుతే
పన్నిరి మాయ లీవిధని । బట్టఁగ నేటికి నిక్కమైన నీ
వన్నె జెలంగునే సుదతి! । వాంఛనువీడుము లేడికాదుగా.

సీత:—ప్రాణేశ్వరా! నా యీ కోర్కెను దీర్పఁజాలరా?

రాము:—కాంతా! తీర్పఁజాలక కాదు. రాక్షసకృత్యంబుల నెఱుంగ సాధ్యముకాదు. ఎవ్వఁడో రక్కసుఁడు మనల వంచింప నిట్ల

మాయాకురంగరూపమున వచ్చియుండనోపు. నీ యీప్సితార్థముల నెఱవేర్ప నాకుఁ గష్టతరమగునా?

సీత:—అయిన నింక సందియమెందులకు? నా మనోభీష్టమును దీర్పుఁడు.

రాము:—అయ్యో! ఎన్నివిధములఁ జెప్పినను నీ పట్టినపట్టును వీడకుంటివిగదా! అబలలు రానున్న యుపద్రవముల నిసుమంతయు గ్రహింపఁజాలక కోరినవాని నెల్లఁ దెచ్చియిమ్మందురు.

సీత:—(ఖిన్నవదనయగుచు) పోనిండు. ఇట్టి నిర్దయారూపులై వర్తింతురని యెన్నఁడును దలంపలేను.

రాము:—(తనలో) ఓహో! ఈమె రాకురాను చింతాక్రాంతురాలై, నిష్ఠురోక్తుల వెలిబుచ్చనారంభించెను. ఎట్లైన నింకఁ దప్పునట్లు తోఁచుటలేదు. (ప్రకాశముగా) ప్రాణేశ్వరీ! ఈ కఠిన వాక్యములేల?

గీ. పట్టి తెచ్చెద నిప్పుడే । పడఁతి మదిని
శంకలందుట యొప్పునే । సాధ్యమైన
ప్రాణములతోన కొనివత్తు । భంగమైన
మృతశరీరము నేఁ దెత్తు । ముఖ్యమిదియు.

(అని బాణమునుగొని బయలువెడల నుద్యుక్తుఁడై లక్ష్మణునిఁగాంచి)

లక్ష్మణా! ఈ సీతను జాగ్రత్తగఁ గాచుకొనియుండుము నే నిప్పుడే యీ కురంగమును బట్టి తెచ్చెదను.

లక్ష్మ:—అన్నయ్యా! మీరును యిట్లు వేగపడుట న్యాయమగునా? ఇది రాక్షసమాయయే కాని, నిక్కముగు కురంగము కాదు. ఎవ్వఁడో దుర్మార్గుఁడు మనల మోసగింప నిట్లు వచ్చియుండెను. అది తెలిసియు నిట్లు వేగిరపడ న్యాయమా?

రాము:—నిక్కమే. కాని సీతకోర్కెను దీర్చుటయే కర్తవ్య కార్యముగఁ దలంచితిని. అది నిక్కమగు లేడియే యగునెడఁ బట్టి తెచ్చి యీపెను సంతసింపఁజేయువాఁడ. కాకున్న భీతియేల? క్షణ కాలముననే రూపుమాపివచ్చెదను.

గీ॥ వంచనము సేయనెంచిన । దుష్టుదునిమి
దుష్టసంహారమొనరింతు । నష్టమేమి?
భీతియేలను వినుమింక । సీతకోర్కె
దీర్చుటెంతయు నొప్పగు । ధరమతిని.

సీత:—నాథా! పోయిరండు.

లక్ష్మ:—అయ్యో! స్త్రీలు తాము పట్టినపట్టును వీడరుకదా!

సీత:—లక్ష్మణా! నా యీచిన్నకోర్కెను దీర్పవలదందువా?

లక్ష్మ:—సాధ్వీ! అది మాయామృగమేకాని, నిక్కమగు హరిణము కాకుండునని యిట్లు నుడివితిని.

రాము:—తమ్ముఁడా! లక్ష్మణా! ఈమెను బహు జాగరూకతతోఁ గాచుచుండవలెనుసుమా! ఒంటరిగ వీడి యెచ్చటకును బోవలదు. అట్లైన దుష్టరక్కసులవలన ప్రమాదము సంభవింపవచ్చును.

లక్ష్మ:—చిత్తము. కాని తామేఁగుటమాత్ర మెుచితముకాదు.

రాము:—ఇప్పుడే తిరిగి వచ్చెదను.

(అని రాముఁడు నిష్క్రమించును)

[సీత, లక్ష్మణుఁడు, రాముఁడుపోయిన దారివైపునకుఁ జూచుచుందురు]

సీత:—మఱఁదీ! లక్ష్మణా! నాథుఁడెంతగ యత్నించినను నాసారంగము పట్టుబడుటయే లేదు. ఎంత చమత్కారముగఁ దప్పించుకొనుచున్నది.

లక్ష్మ:—కానిమ్ము. కొలఁదినిమిషంబుల నన్ని చిత్రవిచిత్రములును దేలఁగలవు.

సీత:—మీ యన్నగారి జాడయే కన్పట్టుటలేదు. ఎంతదవ్వరిగిరో కదా?

లక్ష్మ:—నీలదన్నవింటివా? వనితలెందును దమ యభీష్టమే తీర్చుకొనయత్నింతురు కాని, యెంతగబోధించినను బెడచెవినిదాల్తురు.

సీత:—లక్ష్మణా! నీపల్కులునిక్కములు. నాథునినిష్కారణముగ నిష్ఠురములాడి శ్రమలందఁజేసితిని. తిరిగివచ్చినను లెస్సగ నుండునుగదా!

లక్ష్మ:—అన్నియు మన యిష్టానుసారమే జరుగునా?

సీత:—(ఏమియో వినుట సభినయించి తత్తరమున) లక్ష్మణా! ఏదియో యార్తారవము వినవచ్చుచున్నది.

(ఇరువురును వినుట నభినయింతురు)

[తెరలో] హా! లక్ష్మణా! హా! సీతా! ఈదుష్టరక్కసునిచే—

సీత:—(కన్నుల నీరువెట్టుచు) లక్ష్మణా! లక్ష్మణా! మీ యన్నగారి కేదియో ముప్పు వాటిల్లినది. వినియు నిల్చారకుంటివేల? వేగిరంబుగఁ బొమ్ము.

లక్ష్మ:—ఇట్లు భీతిలెడుదాన వెందులకుఁ బలికితివి?

సీత:—నిష్ఠురోక్తుల కిదియా సమయము ఘోరికినది! తడయుటకు వేళకాదు. త్వరపడుము. త్వరపడుము.

లక్ష్మ:—రాక్షసకృత్యమది యని యేను తొలుత నుడివియుండలేదా?

సీత:—గతించినదానిని గూర్చి తర్కవితర్కములేల? వేగముగఁబోయి నీ సోదరునకు సాహాయ్యమాచరించుము.

లక్ష్మ:—అమ్మా! సీతా! ఎంతబేలవు. శ్రీరామచంద్రునకుఁ బరుఁడెగ్గొనరింపఁజాలునా?

ఉ. రక్కసు లెందఱైన దునిమె । రామునిఁ గన్నులఁ దేఱిచూడఁగా
నెక్కడ? శక్యమౌనె? సతిఁ । డిప్పుడె రక్కసుఁగూల్చియుండఁగా
సొక్కుచునేలఁగూలియును । జూపెను మోసము తథ్యమౌనిదే
వెక్కసమందనేల మది । వీడుము చింతల తల్లిరో యికన్.

సీత:—లక్ష్మణా! నిశాంతివచనంబుల కిది యదను కాదు. ఆపదయే లేకున్న నట్లు కేకలిడునా? పోయిరమ్ము. జాగు సేయకుము.

లక్ష్మ:—తత్తరపడకుము. అబలవగుటచే నిట్లు భీతిల్లుచుంటివే కాని, రామున కేమి? ఆపదలు కలుగుటయేమి? ఆ దుష్టాత్ముండగు రక్కసుండే రాముని బాణమున దెబ్బతగిలి యవసానకాలమునం గూడ మనల వంచింప నిట్లు రాముని పగిది కేకలిడియుండును. సోదరుండా మృతదేహమును గాని తిరిగి వచ్చుచుండును.

సీత:—(తనలో) అయ్యో! నేనెంతగ బ్రతిమాలినను వినకున్నవాఁడు. ఏలకో! నా వామనేత్రము అదరుచున్నయది. (ప్రకాశముగా కోపముతో) లక్ష్మణా! అన్నకాపద జనించినను చూచుచు నూరకుండుటయే నీకుం బ్రతిన?

గీ. నాథుం డాపదలం జిక్క | న్యాయమగునె
ప్రల్లదంబుల పల్కంగ | బరఁగు టెట్లు
సావధానుండవై యెంచవే | సుహృదమును వ
దలఁపడిట్టి నిచ్చుడవంచు | దర్పమేంచు.

నిన్ను నమ్మి యామహానుభావుఁ డెట్లు మోసపోయెను. గోముఖవ్యాఘ్రమవని యిన్నాళ్ళును దెలిసికొనలేదుకదా.

లక్ష్మ:—తల్లీ! నాయెడ నీకు విశ్వాసము లేదా? మీరిట్లు పలుకుట పాడియా! మిమ్ముల నొంటిగ విడిచిపోవలదని యాజ్ఞాపించుట వినియు నిట్టి నిష్ఠురోక్తుల వెలిబుచ్చిన నేనునువాఁడ. ఇక్కారణముగఁ దాము చింతిల్లుటయుం దగదు. ఏకార్యమునందును ద్వరపడుట యుచితము కాదు. అందువలన ననేక కష్టములు సంభవించును.

సీత:—నా హృదయమంతయు నిప్పటికి వెల్లడియైనది. ఛీ!

ఉ. కానవసీమ నాథుఁ డిటు । కాయముఁ బాసిన నన్నుఁబట్టి యు
ద్దాన సుఖింపనెంచితివొ? । ధాత్రి ఖలుండవు దుర్మదాంధ నీ
వీనులఁదాఁకవో కొ? పతి । పిల్చెడు కేకలు క్రూరబుద్ధిచే
దానవు వాయయంచు మదిఁ । దాల్చినహించిన నోర్చుదాననే

లక్ష్మ:—హరిహరీ! (అని చెవులుమూసుకొనును)

సీత:—నమ్మినవారికి ద్రోహమొనర్ప నెంచిన ఘాతకుఁడవు నీమోమునుజూడరాదు. నేను నీకులభించుదాననని కలనైనఁదలంపకుము.

(3 వ అనుబంధము)

లక్ష్మ:—(విచారముతో) అకటా! ఎట్టి వినరానిదుర్భాషల వినవలసవచ్చెను. అయ్యో! నేనాఁ డెట్టి మహాపాతక మాచరించి యుంటినో కదా! (ప్రకాశముగా)

(4 వ అనుబంధము)

మాతా! ఇట్టిదుర్భాషల నాడుటతగునా? కటకటా! నేనంతటి కలుషప్రవర్తకుఁడనా? ఈ ఘోరాటవిని నిన్నువీడి చనిన నెట్టి యిడు మలు కల్గునోయనియు, శ్రీరామచంద్రుని శక్తిసామర్థ్యంబులఁ బూర్తిగ గ్రహించియుండుటచేతను, నూరకుండఁ జాలితినే కాని అయ్యో! నేనంతపాపినా? దుర్మదాంధుఁడనా? తల్లీ!

సీ. శ్రీరాము నిత్యము । సేవించుటయె కాని
యితరచింతల మది । నెంచ లేదు
భగవానుఁడంచును । భావించుటే కాని
దుర్బుద్ధి యెన్నఁడు । దోఁచ లేదు
పరమభక్తినిగొల్చి । వరలుచుందుటె కాని
యొగ్గు నెన్నఁడుదాల్ప । నెంచ లేదు
పతితపావనుఁడని । పల్కుచుండుటె కాని
ద్రోహమాచరింపఁ । దోప లేదు

గీ. కటకటా! యిట్లుదూషింప । ఖలుఁడనంచు
వినఁగరానట్టిపల్కుల । వినఁగవలసె
నింక నిక్కము ఖలుఁడ నే । నిట్టిపల్కు-
లను వినియు జీవములతోడ । మనియుచుంటి.

సీత:—సరి. సరి. తొలుతనుండియు నీ సక్కవినయముల చేతనె నీయన్నగారు మోసపోయిరి. ఎందులకీ వృథాలాపములు. నీదుర్బుద్ధి నీకే కీడునుగలుగఁజేయును. ఎంతదుష్కర్ముఁడైనను, ఎట్టినీచుఁడైనను సోదరుని భార్యను గూడ నెంచునా? ఓహో! ఇందులకేనా భక్తివిశ్వాసములఁ గపటభావమునఁ జూపి వనములకు మాతో నేగుదెంచితివి?

లక్ష్మ:—(తనలో) అక్కటా! ఏమిసేయువాఁడ. ఇటనుండి కదలిపోయితినేని అన్నగారియాజ్ఞను జవదాఁటినవాఁడ నగుదును. పోకుంటినేని యీ సీతాదేవి మూర్ఖత్వంబునఁ బల్కు పల్కులను జెవిఁ దాల్పలేకున్నాను. హా! విధాతా! నన్నెందులకీయిల జన్మింపఁజేసితివి? ఏమియును దోపకున్నదే. ఎట్లైన నీపెదుర్భాషలనుండి తొలఁగి పోవుటయే యుచితము. (ప్రకాశముగా) సాధ్వీ! అన్నగారి యాజ్ఞాబద్ధుఁడనయ్యు నీ నిష్ఠురోక్తులచే నతిక్రమించి వెడలువాఁడ. జాగ్రత్తగ నుండుము.

సీత:—మంచిది. పోయిరమ్ము.

లక్ష్మ:—ఓ పంచభూతములారా! సకలదేవతలారా!

సీ. కరుణించి బ్రోవరే । కాంత సీతను మీరు
విడచిపోవుచునుంటి । వేల్పులార!
దయను రక్షింపరే । ధాత్రీసుతను సాధ్వి
నడవి నొంటరినుంచు । యక్షులార!

రాముఁడేలను నీకింక । రమణినిట్లు
వనములను జేర్చి యిడుములఁ । బాలుసేయు.

సీత:—ఛీ! దురాత్మా పతి యొంటలేని భామల నిట్లు దుర్భాషలాడఁదగునా? పతివ్రతల నిట్లు పరిభవింప నీ కెట్లు బుద్ధిపోడమెను? ఇట్లు పాపాంధకారనిమగ్నులైనవారిని నైనను దండింపఁడా?

రావ:—నా కన్న నైనమెవ్వరు? ముల్లోకంబుల నేకచక్రంబుగఁ బాలించు నన్ను దండించువాఁ డింకొక్కఁడుండెనా?

సీత:—ఓరీ! మూర్ఖా! ఎవ్వరోయన నేల? దుష్టసంహారకుఁడగు శ్రీరామచంద్రుఁడే నిన్ను నిమిషమాత్రమున దునుమఁగలఁడు.

రావ:—అట్టి యసహాయశూరుఁడే యైనచో చేనున్న రాజ్యమును వీడి వనములకు రానేల?

సీత:—ధర్మపక్షపాతియగుటచే.

రావ:—ఒకవేళ బలవంతుడే యనుకొందము. అయిననేమి? ఇప్పుడు నీ దరి లేకుండెనుగదా! ఇంతీ!

ఉ. దాచగనేల మారుఁడతి । తాపముఁగొల్చుచు నుండెనయ్యయో
ఓచపలాక్షి నేడిఁకి । నోర్వఁగఁ జాలను కావు మిందునన్
ద్రోచదు వీడిపోవ నిను । త్రోయ్యలి యెట్టులఁబోవ నేర్తునే
కాచినఁ గావకున్న నిఁకఁ । గాంతరో నిన్నది నమ్మియుంటిగా.

ఇదియునుఁగాక,

సీ. సేయింతుఁ బరిచర్య । సేవకులం బెట్టి
యొంటిమై యీరీతి । నుడుగనేల?
హంసతూలికపాన్పు । లందుండఁ జేసెదఁ
గఠినంపు నేలలఁ । గటపనేల?
పసిడిపుట్టములెన్నొ । భక్తితోనర్పింతు
నారచీరలఁ గట్టి । నడువనేల?

ఉద్యానవనసీమ । సువిద చరింపక
ఘోరవనముఁ జేరి । కుందనేల?

గీ. అట్టిసౌఖ్యంబు విడనాడి । యతివయుండు
పొందరానట్టి యిడుమలఁ । బొందుటేల?
రమ్ము నాతోడ లంకకు । రాజ్యలక్ష్మి
నీకె చెందును రమణిరో । నిజము నమ్ము.

సీత:—హా రామా! రామా! (6 వ అనుబంధము) లక్ష్మణా! నీ పల్కులయందలి యర్థ మించుకయు గ్రహింపఁజాలనైతినిగా!

రావ:—సీతా! నా యీసన్యాసిరూపమునుజూచి వెఱపుంచుచుంటివి కాఁబోలును. నా నిజరూపమును గాంచుము. అప్పుడైన నన్నుమెత్తువు.

(అని నిజరూపమును బొందును)

సీత:—హా! రామా! హా! లక్ష్మణా! (అని మూర్ఛనొందును)

రావ:—అయ్యో! ఈమె మూర్ఛనుమునింగినది. చాల తడవైనది. రామలక్ష్మణులు లేతెంచువేళయైనది. నా విమానముపైనుంచి లంకకుఁ గొంపోయెదఁగాక.

(తెర పడును)

యీవనవాసమే తనకు । నింపగునంచును వెంటవచ్చెఁ దాఁ
గానఁగఁజాలమైతి మిఁకఁ । గాంతను సీతను గాంచుటెట్టులో.

లక్ష్మణా! ఆ మాయాకురంగము వెంటఁ జనుచు సీతను గాచుచుండుమని యెన్నివిధములఁ జెప్పినను వినవైతివి కదా! కీరము లేని పంజరముమాడ్కి యీ పర్ణశాల యెంతగఁ జిన్నవోయియున్నదో చూచితివా!

సీ. విడనాడ లేనంచు । వెంటనంటినసీతఁ
గాపాడఁజాలని । కఠినుఁడయ్యె
పతియె దైవంబంచుఁ । బాయనోపనిసాధ్వి
దుష్టుల కర్పించి । దుష్టుఁడయ్యె
నాథునితోడిదే । నాతికి సుఖమను
జీవితేశ్వరి కిట్లు । చెనటినయ్యె
వనవాసమే యొంటి । వాసయోగ్యమనెడు
కాంతను విడనాడి । కఠినుఁడయ్యె
గీ. రాముఁ డేలను జీవింప । రమణిలేక
యసువులను బాయుటొప్పగు । నక్కటకట!
సీతవిడనాడి యసువులఁ । జేరఁ బురిని
సాధ్యమౌనొక్కొ లక్ష్మణా! । చనఁగ నింక.

లక్ష్మ:—అన్నయ్యా! మీరలె యిట్లు దుఃఖాకులచిత్తులైన నిం కేమి తెరవు? శాంతమూనుఁడు.

రాము:—అయ్యో! ఇం కెక్కడి శాంతము!

గీ. ప్రాణసమురాలు సుగుణాత్మ । భవ్యచరిత
కష్టసుఖము లెఱుంగని । కలికిమిన్న
నాదు భాగ్యరాశియు సీత । నాదు చెంత
లేక జీవించుటెట్లు లే । కాకినగుచు.

కటకటా! నా యీ జీవము లింకను బాసిపోకున్నదే. ఏ నెట్లు నా యర్ధాంగిని, నా యదృష్టదేవతను, నా ప్రాణసమానురాలను, నా సీతను గాంచఁగల్గుదును. నా కింకేమిదిక్కు? లక్ష్మణా! సీతయే యింక లేదా? నా భాగ్యమంతయు నశించెనా? రాముఁ డీ యిల నిఁక నిరర్థకుఁడేనా? అయ్యో! ఏ నెంతపాపాత్ముఁడనైతిని. నా యీ కన్నులిక సీతను గాంచలేవా? నా భాగ్య మంతమొందెనా? నా మొరలు వినువారే లేరా? నా యీ తాప మడంచు పుణ్యాత్ము లెవ్వరును గానరాకున్నారుకదా! అక్కటా! ఏనిం కెందుఁ జొత్తును? ఎవ్వరితోఁ మొఱలిడుదును. నా కాంతయే లేక నాకీ బ్రదుకేల?

ఓ జీవములారా! నన్నుఁ బాసిపొండు. ఓ మృత్యుదేవతా! నాయొద్దఁ జేరరమ్ము. భూమ్యాకాశంబులారా! నన్ను మ్రింగివేయుఁడు.

( 7 వ అనుబంధము )

హా! జానకీ!

ఉ. చిన్నతనంబుఁ జూడ నిటు । చేరియెఁబోఁగివు కాననంబులన్
ఎన్నవు కష్టసౌఖ్యముల । నింతిరొ నాథుఁడు నాథుఁడంచు నీ
కన్నను వేఱులేదనుచు । కాననసీమల కేఁగుదెంచితే
మన్ననసేయలేని నను । మానిని యేటికి వెంటనంటితో
కన్నులఁగాంచు భాగ్యమిఁకఁ । గల్గునొ కల్గదొ యెట్టులోర్తునో.

ప్రాణేశ్వరీ! ఏ దుష్టులు నిన్నుఁ జెఱబట్టి కొంపోయిరో కదా! నిన్నుఁ జూడక యెట్లు మనియుండనోపుదును? క్షణకాలమైన నిన్నుఁ బాయఁ జాలనని పల్కిన పల్కులు నేఁ డెట్లు నీకు మఱపునకు వచ్చెను. కలనైనను నేను నీ చెంగట నున్న వేళనుగూడ "నాథా! నాథా!" యనుచుఁ బలవరించెడుదానవే! నేఁ డెట్లు విడనాడియుండనోపితివి? ఎన్ని విధముల వలదన్నను కురంగమును బట్టియిచ్చినఁ గాని, సంతృప్తినందలేనని పల్కితి

నీ యిడుమ లనుభవించుటకే కాఁబోలును. ఏరక్కసులచేఁజిక్కి సొక్కు చుంటివో! ఏనెంతకాలమీ వియోగానలంబునఁబడిక్రుమ్మగ్గుచు సహింపఁ నోపుదును? నీవు కానరాకున్న నాకీ లోకమేల? రాజ్యభోగము లేల? సౌఖ్యము లేల?

సీ. ప్రాణంబుపోయిన । భరియింతునే కాని
పతిబాయ నంచును । బలుకలేదె?
ఉగ్రాటవులఁజేర । నోర్వఁజాలుదుకాని
సౌధంబు లేలంచు । చనగలేదె?
కటుకు నేలలనుండి । గడపఁగలదు కాని
వలదంచు సౌఖ్యముల్ । పలుకలేదె?
సేవకులేలను । చేరి సేవింతును
వెంటనంపుదనంచు । వెడలలేదె?

గీ. అట్టి సద్భక్తి నేఁడిట్లు । యంతరించె
ఈ వియోగానలంబున । నిట్లునుంద
దాపునను జేరకుండుట । తగునె నీకు
ఎటులనైతును దుఃఖార్తి । నేమిసేతు?

సఖీ! చిన్ననాటను నీ జనకుని గృహమున నెట్టిసుఖము లంది యుంటివో కాని, యీ దురదృష్టుని, రామునిఁ జేపట్టి పడరాని యిడు ములఁ బడుచుంటివికదా! నీతోఁగూడి యుంటచే నింతదనుక నీ వన ములఁ జరించుచు, కందమూల ఫలంబులే యాహారముగఁ గైకొని కాలమును బుచ్చుచున్నను నించుకయు శ్రమయని తోఁచుటలేదు. ప్రేయసీ! పదునాల్గు వత్సరము లెట్టులో గడిపి తిరుగఁ బురమునకుఁ బోయిన తల్లులాది సకలబంధుజనంబులును నాదరిఁజేరి 'సీతయెచ్చట' యని యడిగిన నేమని ప్రత్యుత్తరమిచ్చువాఁడ? అయ్యో! ఆ కుర

గము నే నిటకు రానేల? వచ్చితో నీవు దానిని దెచ్చియిమ్మని పట్టుబట్టుటేల? ఎన్నివిధముల హితములఁ దెల్పినను వీనవైతిగా! లక్ష్మణుని పల్కు లాకింతయుఁ దలపక యే నేల దానివెంట నరిగి తిని. ఏడి రావలదని పలుసుఱు నుడివినను నా యాజ్ఞను గలనైన మీఱిరియుఁడని లక్ష్మణుఁ డేల నీ నిష్ఠురోక్తులకు మనసు చెడి నిన్ను విడనాడి నాకడ కేఁగుదెంచె?

గీ. తొల్లి నేఁ జేసి యున్నట్టి । దుష్కృతంబు
యిన్నిటికిని మూల మగుచు । నిన్నుఁ బాపి
వంత నందంగఁ జేసె నే । నింతి వదలి
పరఁగుకొట్టులో తోపదు । భగవదాజ్ఞ.

హా సతీతిలకమా! ఇఁక నీ జన్మమున నిన్నుఁ గాంచుటయే కల్లయగునుగాఁబోలును. అయ్యో! ఎటులనైతును?

లక్ష్మ:—సోదరా! ధీరచరితులయ్యు నిట్లదైర్యముఁ బూని వర్తించిన నెవ్వ రడ్డుపడువారలు.

ఉ. ఎవ్వఁడొ దుష్టరక్కసుఁడు । యీవిధి సీతను గొంచుఁబోయె వాఁ
డెవ్వఁడొ వేగమే యరసి । యార్యనుబూనియు గీటడంచియున్
అవ్వల సీతఁ గాంచుటయు । నారయ క్షత్రియధర్మమౌ గాకదా
యివ్విధిఁ జింతలందుచును । నెంతగఁ బుచ్చిన నేమిలాభము.

కాన సీతజాడ లరయుటయే యిందు కర్తవ్యము. ఇట్లింతకాల మీ రీతిని గుందుచున్నను నిష్ఫలమేకదా! సర్వమెఱింగిన మీరలే యిట్లు దుఃఖించుచుండిన నెవ్వ రెదురాడువారలు,

రాము:—తమ్ముఁడా!

ఉ. జాడలుతీయ నెట్లగును । జానకిఁ గాంచెదు భాగ్యమున్న నీ
వేడను నిష్ఠురోక్తులకు । వీనులనిచ్చియు నోర్వఁజాలకే

వీడుటదేల జానకిని । వెఱ్ఱితనంబగు యత్నమేల నేఁ
జూడఁగఁజాల సీతనిఁక । సోదర! మృత్యువె తథ్య మింకన్.

గీ. భూమిజను బాసి యేరీతిఁ । బురికి వెడల
నగును లక్ష్మణా! నేనిందె । యవని పుత్రి
మదిని దలఁచుచు సతతము । మసలుచుందు
మరలి పొమ్మిఁక నీవును । మానకిప్డు.

లక్ష్మ:—(తనలో) అయ్యో! రామురా నీమహాత్ముఁడు దుఃఖ మతిశయించుచు మతి చలించిన వానిభంగి యధైర్యచిత్తుఁ డగుచున్నాడు. హా! దైవమా! ఏమి సేయుదు? ఎట్లీతని ధైర్యసంపన్నునిగఁ జేయువాఁడ? (ప్రకాశముగా) అన్నయ్యా!

గీ. ఆపదలు కల్గుచుండుట । యవలఁ బాయ
సహజమగు మానవులకును । సారసాక్ష
కష్టసుఖముల కెంటిని । గానకున్న
భువియె నిష్ఫలంబగుఁగాదె । భూమిపాల.

తామే యిట్లధర్మములకుఁ బాలువడిన మిమ్మెయుదాహరణఁగఁ గైకొని యిఁక లోకులెల్లరు కష్టముఁ గొదవిన "నాఁడు శ్రీరాముఁడే తప్పించుకొనఁజాలనివేళ మనమా నీదుట" యని యధైర్యముఁబూని యాధాత్మ్యజ్ఞకే దూరులగుదురు. మీకు హితములుబోధింప నేనెంత వాఁడను? మీరెఱుంగని ధర్మము లెందైనఁగలవా? సీత మహా పతివ్రతాశిరోమణి. ఆమెను జెఱఁగొని పోయిన దుష్టులు చేటువందుదురనుట నిస్సంశయము. ఇంతియేగాక దుష్టసంహారమే కర్తవ్యమని మీ రెన్నిమాఱులు నొక్కి పల్కియుండలేదు. ఆపల్కు లన్నియు మఱచి నేఁడిట్లు విరాగులగుట న్యాయమా? నీవాగ్రహించిన నీ కెదుర్త్రిలోకంబున వేఱొక్కరుకలరా? నీవేతలఁచిన ముల్లోకంబులుభస్మంబు

కాకుండునా? ఇప్పుడు సీతాన్వేషణమే లేక యూరకున్న రాముఁ డసమర్థుఁడై పరులు తన ధర్మపత్నిని గొనిపోయినను విడిపింపఁ జాల కుండెనని యపవాదముల పాలొనర్పరా? అప్పటిచింత యింతకు వేయి మడుంగు లెక్కుడు కాకుండునా? కావున నీకనైన ధైర్యావలంబికులై కర్తవ్యకార్యమునకు గడంగుఁడు. సీత నొకింతయు భీతిలేక, దుష్టసంహారకుఁడగు శ్రీరాముని భుజపరాక్రమమును మఱచి కొంపోయిన యాతుచ్ఛుఁ డెవఁడో తెలిసి దునుముటయే ముఖ్యము.

(8 వ అనుబంధము)

రాము:—(క్రోధమూని) ఓరీ! అధమాధమా! మేము దరి లేనివేళ నిటఁజేరి చోరునిభంగి సీతను గొనిపోయిన నీ వెవ్వఁడవురా?

ఉ. ఎందికఁ డాఁగఁ జూచెదవొ । యెవ్వరిఁ జేరుదొ కావుమందు నీ
వెందుననున్న మాననిక । వీడక మున్నెద దుర్మదాంధ నీ
యంధత మాన్పఁజాలుదును । నాపగశక్యము ధాత్రి నైన నో
పంద యిదేమి యాగడము । భారము సైపఁగఁజాలుదే యిఁకన్.

లక్ష్మణా! ఆదురాత్ముఁ డెవ్వఁడో యెట్లు తెలియవగును?

లక్ష్మ:—శ్రీరామచంద్రా! ముందుగ సీత యీప్రాంతములం దెచ్చటనైన నుండునేమో యరయుదము రండు.

రాము:—అయ్యో! నీకింక నిట్టి సంశయము లేల? తానొంటరిగఁ బర్ణశాలను వీడి చరింపఁ బాల్పడునా? అయినను నీయిష్టానుసారము దారితీయుము.

(అని యిరువురును నిష్క్రమింతురు)

(తెర పడును)

[తెరలో]

లక్ష్మ:—సోదరా! అదిగో! అటుచూడుము. ఎవ్వడో రక్క-సునివలె నున్నాడు. మనల నంచించిన దురాత్ముఁ డాతఁడే యగును. ఏమియు తెలియఁగనివానిచందంబునఁ బడియున్నవాఁడు.

(క్రోధముతో)

గీ. పోయి వధియించువాఁడ నే । పుడనుపాల
యాజ్ఞ నొసఁగుఁడు తడవేల? । యాదురాత్ముఁ
బట్టి నను మాడకుండుట । పాడియగునె?
కాలయాపన మింకేల । కమలనేత్ర!

రాము:—సోదరా! ఆతఁడు రక్క-సునివలెఁ దోచుటలేదు. నిక్క-ముఁ దెలిసికొనకుండ వధించుట పాడియగునా? పోయి నిజ వృత్తాంత మరయుదము రమ్ము.

[తెర యెత్తఁబడును]

(ఒడలంతయు రక్తముచే నొకపక్షి యందుఁ బడియుండును)

[ప్రవేశము—రామలక్ష్మణులు]

రాము:—లక్ష్మణా! ఈతఁడెవ్వడో యొడలంతయు రక్తము గ్రమ్మి కొనయూపిరితోఁ బడియున్నాఁడు.

(అని దగ్గరకుఁ బోవుదురు)

జటా:—(వారిని గాంచి) ఆర్యా! శ్రీరామచంద్రా! ఇదే నమస్క-రించుచున్నాఁడను. నానామము జటాయువందురు. మీ జనకుఁడగు దశరథుని చెలికాఁడను. దుష్టాత్ముండగు రావణుఁడు సీతా మహాదేవిని మీరు పర్ణశాలను లేనివేళఁజూచి తననివాసంబగులంకకుఁ గొనిపోవుచుండ సహింపనోపక వానితోఁబోరాడి తుద కాతనిచే నోడింపఁబడి మృతినొంద సిద్ధముగ నుంటిని. మీ కీవార్త నెటిం

గింమాటకే యింతదనుక మనియుండ జాలినాఁడ. రామా! రామా! రామా!

(అని జీవములఁ వీడును)

రాము:— (9 వ అనుబంధము)

లక్ష్మణా! ఆహా! ఏమి యీతని విశ్వాసము. మన జనకునకుఁ బ్రాణమిత్రుఁడఁట. కాకున్న సీతకొఱకై లంకాధిపునితోఁ బోరి యిట్లు మరణించునా? ఈమహాత్ముని ఋణమెన్నటికిని దీర్చుకొనఁ జాలము. పక్షిరాజేంద్రా! తుదకాలమైన సీతతో సంభాషించు భాగ్యముకూడ మాకు లేకపోయెనుగదా! సోదరా! ఈతఁడు మనకుఁ బితృసమానుఁడు. కాన దహనాది క్రియలాచరించి మఱియు సీతను వెదకుటకై తరలుదము.

లక్ష్మ:—చిత్తము. (అని యిరువురు నా మృతకళేబరమును దహన మొనరింప గానిపోవుదురు)

(తెర పడును)

రెండవ రంగము

ఋష్యమూక పర్వతము

[సుగ్రీవుఁడు హనుమంతాది మంత్రివర్గముతోఁ గూర్చుండియుండును]

సుగ్రీవుఁడు:—

(10 వ అనుబంధము).

హనుమంతా! నా కీయిడుమ లెన్నటికిని దీఱునవికావు. ఏపాప మెఱుంగని నన్నిట్లకారణముగ నానావిధముల శిక్షించి పాఱఁద్రోలిన యీమహాత్మున కెన్నటికైన నంతము కల్గునా? నాకు సోదరుఁడే లేకున్న, రాజ్యమాది భోగంబులేల యని యెన్నివిధముల వలదన్నను

కారు. మీ రింతకుమున్ను పొందిన శ్రమలచే నిట్లు భీతినందుచుండిరి. శాంతులుండుఁడు. నే నేఁగి వారి నిజవృత్తాంత మరసి వచ్చెదను.

సుగ్రీ:—పోయి త్వరితముగ రమ్ము.

హను:—చిత్తము.

(అని నిష్క్రమించును)

(తెర పడును)

[ప్రవేశము—రామలక్ష్మణులు]

రాము:—సోదరా! ఋష్యమూకాద్రి యిదియే కాఁబోలును. ఇప్పుడు మన మిందుఁ జొచ్చి యెట్లు సుగ్రీవుని సఖ్యము నంగీకరింపఁగలము ఒకవేళ నాతనికడ కేఁగిన మన్నించునో, మన్నింపకుండునో?

లక్ష్మ:—ఆర్యా! ఆతఁడును తన సోదరుఁడగు వాలిచే దఱుమఁబడి, తెరువెయ్యదియు లేక, యుండుచున్నవాఁడని వింటిమి కదా!

రాము:—ఎట్టి కష్టములు అనుభవించినను తుదకు సీతను గాంచిన నంతియే చాలును.

లక్ష్మ:—అదిగో! వానరుఁ డెవ్వఁడో యిందుండి మనదెస కరుదెంచుచున్నవాఁడు ఇదియును గొంత శుభసూచకమే.

[ప్రవేశము—హనుమంతుఁడు]

హను:—(తనలో) ఆహా! ఏమిది? వీరి ముఖావలోకనంబున నా మనస్సు ఉప్పొంగుచు, సంతస మతిశయించుచున్నది. ఇందులకుఁ గతం బేమైయుండును? వీరినిజూడ అవతారపురుషులని తోఁచుచున్నది. (శ్రీరామునిజూచి), ఈ మహానుభావుఁడు నిక్కముగ విష్ణువంశాసంభూతుఁడు కాని, వేఱొక్కఁడు కాఁడు. కాకున్న సామాన్యపుమానవున కిట్టి తేజోవిలాసములుండునా? తినఁబోవుచు రుచికోర నేల? పోయి సంశయమును నివృత్తి చేసికొనెదనుగాక. (సమీపించి) మహాత్ములారా! నమస్కారము.

రామ + లక్ష్మ:—శుభ మొదవుగాక!

లక్ష్మ:—ఓయీ! నీ వెవ్వరవు?

హను:—అయ్యా! ఏను హనుమంతుఁడనువాఁడ; సుగ్రీవుని మంత్రిని; సఖుఁడను. మిమ్ములఁ గాంచి, కారణాంతరములచే భీతిలి, మీ రాతని సోదరుంపను, శత్రువుఁడు నగు వాలిచేఁ బంపఁబడిన వారలని యెంచి, తెలిసికొనిరమ్మని నన్నిటకుఁ బుత్తెంచె.

లక్ష్మ:—

గీ. దశరథుని పుత్రులము మేము । ధరణిజాత
సీతనరయంగ వెడలియుఁ । జేరయిచట
వచ్చుచున్నాము సుగ్రీవు । వార్త నెఱిఁగి
సఖ్య మొనరింప నతనితో । సత్యమిదియు.

మేము రామలక్ష్మణులనఁబరగుదుము. జనకుని యాజ్ఞానుసారము వనులం జేరి కాలమును బుచ్చుచుండ నెవ్వఁడో దుష్టుఁడు ఈ మహానుభావుని ధర్మపత్నియగు సీతాదేవిని నపహరించెను. తత్కారణమున నిట్లున్నామురలకై వడి మతి చలించి సంచరించుచుఁ దుదకు సుగ్రీవునివలనఁ దగిన సాహాయ్య మొదవుననియెడు హేతువుచే వాతని దర్శింప నేతెంచితిమే కాని వాలిచేఁ బంపఁబడిన శాత్రవులము కాము.

రాము:—హనుమంతా! నివు ముందుగఁబోయి మా వార్త మీ ప్రభువుల కెఱింగించి భీతి నెడఁబాపుము. మేమును నీ వెంటనే వచ్చెదము.

హను:—మహాప్రసాదము. (అని నిష్క్రమించును)

రాము:—లక్ష్మణా! తడవేల? మనమును సుగ్రీవుని జేరఁ బోవుదము రమ్ము.

లక్ష్మ:—చిత్తము. (అని యిరువురును నిష్క్రమింతురు)

(తెర పడును)

## మూడవరంగము — ఋష్యమూక పర్వతము

[సుగ్రీవుఁడాది వానరులు కూర్చుండియుందురు]

సుగ్రీ:—హనుమంతా! ఇప్పటికిని గదా నా మనసు కుదుటపడినది.

ఉ. భీతజనించె శాత్రవుల ! పేరుఁ దలంచిన మంత్రిపుంగవా
పాతకమాని వాలివలె ! వాలికి నిల్లొసంగెదఁ గల్లకటల్
నీతియె లేని వానగుని ! నీరజనేత్రుఁడు హతమొనర్చునో
సీతను దెచ్చియిచ్చుటను ! జేరియు నాతనిఁ గొల్చి గొప్పగన్!

హను:—ఆ మహానుభావుఁడు సాక్షాద్విష్ణావతారమే కాని, వేఱొండు కాదు. ఆతనితో మీ సోదరుఁడగు వాలికిని, మీకును గల విరోధకారణమంతయు వచించితిని. దుర్మార్గవర్తనుఁడగు వాలిని సంహరించి, మిమ్ము నే కిష్కింధాపురాధీశ్వరునిఁగఁ జేయువాఁడనని ప్రతిన మొనర్చెను. ఆతని కసాధ్యమగునది యీ యిల నెద్దియుఁ గానరాదు.

సుగ్రీ:—ఎంతయు ధన్యుఁడను.

హను:—అదిగో! రామలక్ష్మణులు దయచేయుచున్నవారలు ఎదురేగి తోడ్కొనివత్తము రండు. (అని ముందునకేగుదురు)

సుగ్రీ:—(చేతులు జోడించి) దేవ దేవా!

గీ. అవతరించితివి యీయిల ! యవనిభార
హరణమొందింప నెంచిన ! యాదిదేవ
నీదు మహిమంబుఁ గననేర ! నీరజాక్ష
శరణు కావుము పరమేశ ! శరణు శరణు.

మహాత్మా! తొలుత మిమ్ము దివ్యులఁగాంచి శాత్రవులని తలఁచితిని. నాపూర్వపుణ్యవశంబున యవతారపురుషుఁడవై దర్శనమొసంగితివి. శ్రీరామచంద్రా! రఘువంశోద్ధారకా! నా వృత్తాంతమంతయు నీ హనుమంతునివలన వినియేయున్నారు. సీతాన్వేషణమున శక్తివంచన లేక తగు సాహాయ్య మాచరింతును. నన్నీ యిడుమల నుండి తప్పించు భారము నీదే స్వామీ!

రాము:—వానరపుంగవా! భీతినివదలి ధైర్యయుక్తుఁడవుకమ్ము.

చ. అనుపలువచ్చి యుద్ధమున । నాపగఁ జూచిన పీనువాఁడనే
సమరమునందు నిర్జ్వికను । సాగరమందున డాగియున్న నే
క్రమమ్మున యుద్ధమందు దలసిఁ । గారణమంతయు వెల్లడించుచుం
సమయమునం జూపించెదను । సత్యమసత్యము నమ్ముమింతయుం.

సుగ్రీ:—ధన్యుఁడనైతిని. ధన్యుఁడనైతిని.

రాము:—సుగ్రీవా! పిదప నివేమరక సీతాన్వేషణమునఁ గడు శ్రద్ధవూనవలయును సుమా!

సుగ్రీ:—మహాత్మా! ఇంకనుసందియమా! జలరాసులన్నియు నొక్కటిగా నింకినను, భూమ్యాకాశంబులు తలక్రిందైనను, సూర్యచంద్రులు గతులఁదప్పి చరించినను ననృతమాడువాఁడఁగాను.

లక్ష్మ:—రామచంద్రా! నిష్కారణముగ వాలిని దునుముట ధర్మముకాదా?

రాము:—సౌమిత్రీ! నీసంశయమును బాపెదను వినుము.

గీ. వాలి పరసతీలోలుఁడు । పాపుఁడయ్యె
నైచకర్మునె దునుమక । క్షత్రియులకు
దుష్టసంహార మొనరించి । శిష్టజనులఁ
గాచుటయె యిందుఁ జూపెడు । కారణంబు.

సుగ్రీ:—సత్యము. మహాత్మా! సత్యము.

హను:—తండ్రీ! రామచంద్రా!

సీ. ధర్మమంచును నెంచి । తాటకి దునుమాడి
కౌశికుయాగంబు । గాచినావు
భుజశక్తిమముఁ జూపి । భూజాతఁ జేపట్టి
హరువిల్లు తృణముగ । విఱిచినావు
దుష్టరక్కసులను । దునుముగ నడవికి
దశరథునాజ్ఞ చేఁ । దరలినావు

భక్తి జటాయువు ప్రార్థనల్ సలుపంగ
వాత్సల్యమును జూపి వరలినావు
గీ. ధర్మపరిపాలనాశక్తి ధరణి నిట్లు
యవతరించిన పురుషుండ వయ్య నీవు
అట్టి నినుఁ గొల్వ గలవేమి? యనిలచరిత
రావ రక్షింప సుగ్రీవ రామచంద్ర.

కారణాంతరములచే నిట్లు మానవుండవై, సకలజీవరాసుల మాయాలోకంబున ముంచి వదలకున్న దేవదేవుడ నీవు కావా? లీలచే నీవిట్లు తరలియుండి లోకమునకు నీకులం గలపనెంచితివే కాని నీవేమి! ధర్మమూర్తివి గోప్యమేల చేయుదువు? మేము నీకు సాహాయ్య మాచరించుట యేమి? మే మెన్నాడో చేసిన పుణ్యఫలముచేతనో నీ దర్శనభాగ్యము లభించి తరించితిమి.

గీ. ధర్మపురుషుండ వగు నిను మార్గమందుంగ
లేక తపియించుచుండగా నీవు వెలసి
నీదు మహిమంబు గననెట్లు నీరజాక్ష
సాధ్యమౌ నాకు లోకైక సదయహృదయ!

లక్ష్మ:—సోదరా! తడవేల? సత్వరంబున వాలిని సంహరించి యీసుగ్రీవుని పట్టాభిషిక్తునిగఁ జేసి సీతాన్వేషణమునకుఁ గడంగవలదా?

రాము:—సుగ్రీవా! ముందుగ నీవేఁగి వాలితో సమరమునకుఁ దలపడుము. మేమును నీ వెనువెంటనే వచ్చి చేయవలసిన కార్యముఁ జేయుదుము.

సుగ్రీ:—చిత్తము.

(అని నిష్క్రమించును)

(తెర పడును)

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# లంకాదహనము

అను

# విభీషణపట్టాభిషేకము

## తృతీయాంకము

కిష్కింధాపురమునకు సమీపము

[వాలి పడియుండ, సుగ్రీవుఁడు, రామలక్ష్మణులు, హనుమంతుఁడాది వానరులు నిలచియుందురు]

వాలి:—రామా! రఘువంశదీపకా!

ఉ. చాటున డాగి యీగతిని శౌర్యవిహీనతఁ గొట్టఁజెల్లునే
ఏటికి దుష్కృతిమార్గమునను ఏటికి నీయుపమాయ రాఘవా
నాటకమొ లేదు నాకుఁగను సాహసమంచును జెప్పనొప్పునే
మాటలు వేయిచెప్పుచు యును మానక మదటికి భీతికల్గెనా?

నినుఁబోలు సుక్షత్రియకులసంజాతుఁడ కట్టి నీచప్రవర్తనలు తగునా? నాతోడ యుద్ధమాచరింప సమర్థుఁడగుదేని యెదురుగవచ్చి రణమాచరింపఁజాలకపోతివా? ఇప్పుడు సిద్ధధర్మానువర్తన మేమూల డాగెను? అగును. భార్యను బాసి మతి చెడియున్నాఁడవు. ఇట్టి సమయమున న్యాయాన్యాయ వివక్షత కల్గునా? నీకు సుగ్రీవుఁడు సాహాయ్య మాచరించు ననియేకదా? నన్ను కారణముగ యధర్మ యుద్ధమున వధించితివి. ఏను నీకెట్టి కపకార మొనర్చియుంటిని? ఈవార్త నాకెఱింగించినఁ దక్షణమే నీమ్రోల వ్రాలి నీయాజ్ఞను వడసి—

హను:—ఆర్యా! ఈతని సతియగు తార యిట కరుదెంచు చున్నది.

[తార అంగదునితోఁ బ్రవేశించును]

(11 వ అనుబంధము)

తార:—హా! నాథా! (యని భర్తపైఁ బడును. కొంతవడికి) అయ్యో! ప్రాణేశ్వరా! జీవములను బాసితివా? మా కింకేమిదిక్కు? నాథా! నాథా! అయ్యో! పలుకవేమి? ప్రాణేశ్వరా! ఈ చిన్న కుమారు నెవ్వరిపాలొనరించి దివి జేరఁబోతివి? రామునివలన నీకు నేఁడు దీర్ఘనిద్ర జనించెనా? కటకటా! నన్ను వీడిపోవుట న్యాయ మా! నీతోడఁ గొనిపొమ్ము. అక్కటా! నీ మో మెంతలో గళా విహీనమైపోయినది. సత్యమును గ్రహింపఁజాలకపోతివా? శ్రీరా ముఁడు నన్నేల యకారణముగ వధించునని గర్వించితివే క్షత్రియులకు న్యాయాన్యాయములు కావలెనా? శ్రీరాముఁ డసమానబాహు విక్రమధనుండని తెలిసియు నిట్లాతనితో సమరమునకుఁ దలపడితి రిట్లు మృతినొందుటకే కాఁబోలును. అయ్యో! నాయీ తాపాగ్ని యెట్లు చల్లార్పఁగలదు? ఎందుఁజొత్తును? రాఘవేంద్రా! అబలుఁడగు సుగ్రీ వునిమూలమున నెల్లవేళల నిన్నే భక్తినిఁ గొల్చుచు భజియించు నీతని నకారణముగఁ దునిమితివా? సోదరుల జగడాలయందు నీ వేల చేర వలసివచ్చెను. నీ సతిని గొనివచ్చుటకేయైన, వాలి యందులకు సమ ర్థుఁడుకాఁడా? మీకు వేయింత శ్రమలు కలుగకుండగనే యా రావణుని బట్టితెచ్చి నీ పాదపద్మములకు మ్రొక్కఁజేసియుండునే. రామచంద్రా!

గీ. సతినిబాసియె కాదయ్య । మతిచలించి
తిరుగుచున్నావు వనములఁ । దెరువులేక

పతిని విడనాడి నే నెట్లు । బ్రతుకుదాన
ధర్మ మేమాయె నిత్తరి । ధరణిపాల.

హను:—దేవీ! నీ నాథుఁడు—

గీ. ఆదిమధ్యాంత రహితుఁడై । యలరునట్టి
శ్రీమహావిష్ణుచేతిలోఁ । జిక్కి మడసె
పూర్వపుణ్య ఫల మదెంతో । పొల్పనగునె
చింత లేటికి వీకుము । సంతసించు.

తార:—అయ్యో! ఇఁకను నాకు సంతసమా! భక్తపరా ధీనుండని వన్నె కెక్కిన శ్రీరామమూర్తియే యధర్మములకుఁ బాల్ప డిన నింక నితరులలెక్కింపనేల? హా! కుమారా! తండ్రి లేని యదృష్ట హీనుఁడవైతివా? నిన్నెన్నఁగాంచి, యీరాముఁడు జాలినొందకుండెనా?

అంగ:—హా!, తండ్రీ! చిన్ననాటనుండియు క్షణకాలమైన వీడక, ప్రేమాతిశయంబుల నన్నుఁ బెంచిన నీ ప్రేమ నేఁ డెట్లు వీడి పోతివి. జనకా! ఒకమాఱు కన్నులఁదెఱచి నన్ను వీక్షింపవా? ఏను దఱిజేరినంతనే కౌగిళ్ళను జేర్చి ముద్దుఁగొనెడువాఁడవే! అయ్యో! నేఁ డెంతగఁ బిల్చినను బలుకకుంటి వేమి? ఇఁక నన్ను 'నాయనా! తనయా! రమ్మ' అని పిల్చువా రెవ్వరు? నా యాటపాటలఁ జూచి మురియువా రెవ్వరు? ఈ పాపాత్మునకు నీయట్టి జనకుఁడు దక్కునా?

రాము:—లక్ష్మణా! అతని నించుక శాంతిపఱుపుము.

లక్ష్మ:—అంగదా! సర్వమునెఱింగిన నీవి ట్లబలలరీతిఁ గుందఁ దగునా? కాల మాసన్నమగునెడ నెవ్వ రడ్డుపడువారలు? ధాతాజ్ఞ మీఱ నెవరికి వశమ్మగును. జీవు లెల్లకాల మీయిల శాశ్వతంబుగ నిలువనోపునా? దినమున కెన్నెన్ని జీవరాసులు పుట్టుచున్న వెన్ని

జీవులు గిట్టుచున్నవి? ఇదియొక నాటకరంగము. భగవానుఁడే దీనికి సూత్రధారుఁడై నడపుచున్నవాఁడు.

రాము:—సుగ్రీవా! తడవేల? ఈతఁడు మరణించినాఁడు. దహనాదిక్రియలకుఁ గడంగుఁడు.

సుగ్రీ:—చిత్తము.

రాము:—(తారను జూచి) ఓ వనితా! దుఃఖింపకుము. నీ పతి నాచే మడియుటచేఁ బుణ్యలోకము లందఁజనును. నీ యీ పుత్త్రునకు యౌవరాజ్య పట్టాభిషేకముఁ జేయించెదను. చింతఁదక్కి యుండుము.

సుగ్రీ:—కుమారా! జనకుని కైవిచారించిన యాతని యుత్తమ పదవుల కర్హుఁడైనవాఁడవగుదువు. ముల్లోకవంద్యుఁడగు శ్రీరామచంద్రునిచే సంహరింపఁబడినందులకు మన మెంతయు సంతసింపవలయును. రామాజ్ఞ ననుసరించి దహనక్రియ లాచరింపఁబోవుదము రమ్ము. (రామునిఁగాంచి) మహాత్మా! సెలవొసంగుఁడు.

రాము:—మంచిది పోయిరండు. (అందఱునునిష్క్రమింతురు)

(తెర పడును)

---

రెండవరంగము—కిష్కింధాపురమందలి రాజసౌధము.

---

[సుగ్రీవుఁడు మంత్రులతోఁ గూడియుండును]

సుగ్రీ:—హనుమంతా! ఎంతద్రోహ మాచరించితిమి. ఇంత దనుక శ్రీరామచంద్రుని వృత్తాంతమే మఱచియుంటిమే! వారాగ్రహచిత్తులైన, వాలివలెనే నేనును బరలోకమున కరుగవలసినవాఁడనేకదా.

హను:—ఇఁకనైన సత్వరంబునఁ బోయి శరణువేఁడి, వారి కార్యానుకూలమునకుఁ దోడ్పడు టుచితము.

[ తెరలో ]

లక్ష్మ:—(క్రోధముతో) ఓయీ! సుగ్రీవా!

ఉ. వాలిని సంహరించెఁగద । భారముతీరెను రాజ్యలక్ష్మి నీ
ప్రోలనువాలెరాముఁడిఁక । బ్రోచుటరాజ్య మొసంగుటల్ మదిన్
లీలగనెంచితేని నవ । లీలగఁ ద్రుంచును రాముఁడెంచినన్
కాలముఁదీఱువేళ నిటు । కావరమబ్బును వానరేశ్వరా.

అగునగును. నిన్ననసేల? రాజ్యమదాంధతయు, స్త్రీలోలత్వమును దాపరించిన కాలమం దిట్టి దుర్బుద్ధులు జనించును కాఁబోలును. తొలుత నెట్టి వినయవిధేయతలఁ జూపితివో నేఁడు వానికి వేయిమడుంగు లెక్కుడుగ గర్వాంధతను వెలిఁబుచ్చుచుంటివి. కాని మ్మ. శ్రీరామచంద్రుని నిశితబాణంబుల కెఱయగువేళనైన నీ తప్పిదముల గ్రహింపఁజాలుదువు.

గీ. నీచులకు సౌఖ్యమబ్బిన । నీతిమాలి
గర్వమొదఁదాలురంతెట । కావరమున
పాలువోసియుఁ బెంచిన । పాము తనదు
దుష్టబుద్ధిని మానునే । దోసమనుచు.

ఎవరినెట్లు సన్మానింపవలెనో, తెలిసి వర్తింపకున్న, నుపకారుల కుపకారమొనర్పకుండుటయే కాక, తుద కపకారమును గూడ నాచరింపఁ బాల్పడుదురు.

సుగ్రీ:—(భీతి నభినయించుచు) అనుకొనినట్లే యైనది. హనుమంతా! అదిగో లక్ష్మణుఁడు క్రోధపూరితుఁడై నిందించుచు నిటు వచ్చుచున్నాఁడు. ఏమిసేయువాఁడ?

హను:—వానరాధిపా! ఎదురేఁగి కొనివచ్చి క్షమాపణ సేఁయుటయే యిందు కర్తవ్యము.

సుగ్రీ:—ఏమైన నారిదే భారము. నడువుము.

(అని యెదురేఁగి లక్ష్మణునిఁ దోడ్కొనివత్తురు)

లక్ష్మ:—సుగ్రీవా! నీకు రాజ్యలక్ష్మి చేకూరి యెంతకాలంబైనది.

సుగ్రీ:—(తలవంచి యూరకుండును)

లక్ష్మ:—శ్రీరాముని వాక్యములను వినుము—

చ. వినయముఁజూపి యీకరణి । పీడగ సెల్లు నె బాసలన్నియుఁ
తనువిఁక శాశ్వతంబనియు । దప్పదు రాజ్యము నిక్కమంచు నీ
మనమున నెంచియుంటివొకొ । మానక పంపెద వాలిఁజూడగఁ
పనుపుము నీదు నిశ్చయము । వానరశేఖర సత్వరంబుగా.

గర్వాతిశయమే యిందులకు మూలకారణంబైన నీరాజ్యము నీకుఁ దక్కకుండుటయేగాక జీవములకుఁగూడ నాశ వదులుకొనుమనియె. ఇందుకుఁ బ్రత్యుత్తర మేమి యొసంగెదవు?

సుగ్రీ:—(చేతులుజోడించి) కాఱియా పనసైనమాట సత్యమే.

గీ. తనయులతప్పు సైరింప । దలచకుండ
దండ్రియే శిక్షజేయంగఁ । దలపమునెడ
దెరువు కలదొక్కొ లక్ష్మణా । ధీరమతిని
నిలుపనోపుదునా యిక । నీరజాక్షు
డాగ్రహించిన గతియేమి? । యమలచరిత.

లక్ష్మ:—ఓయీ! ఇప్పటికి రాముఁడు జ్ఞప్తికి వచ్చెను గాబోలును. కానిమ్ము. ఇఁకనైన రామదర్శనార్థము బయల్వెడలెదవా?

సుగ్రీ:—అయ్యో! ఇంకను బుద్ధికలుగకుండునా? ఆ మహానుభావుని దర్శనమే సర్వవిధుల శ్రేయోదాయక మగునెడ నాతని కార్యము జక్కపఱచ కూరకుండువాఁడనె. ఇప్పుడే బయలుదేఱుదము నడువుఁడు. (అందఱు నిష్క్రమింతురు)

(తెర పడును)

## మూడవ రంగము

### ఋష్యమూక పర్వతము

[ప్రవేశము—రాముఁడు]

రాము:—లక్ష్మణుఁ డింకను రాకుండుట కేమి హేతువోకదా! ఆసుగ్రీవున కీమాటయే జ్ఞప్తి లేకుండెనుగాఁబోలును. ఉన్నను తన కార్యములన్నియు నెఱవేరుటచే సాహాయ్యమాచరింప నిష్టపడకుండెనో? కష్టకాలమున నన్నియు నశుభములే కల్గునుగాని శుభము పొందవునా! మిత్రులే శత్రువులగుదురు. ఒక్కరును మన్ననసేయనోపరు. ఏనాఁడు నాలక్ష్మి నన్నెడబాసెనో యంతటితోనే నా భాగ్యభోగ్యములన్నియు నశించినవి. హా! సీతా! సుగుణోపేతా!

గీ. పాపకర్ముఁ డీరాముఁడు । పడఁతి నిన్నుఁ
బరుల కర్పించి యరమొక । బ్రదికియుండె
నెటుల నోర్వంగఁజాలితో । యింతి కడకు
జీవములె బాసియుంటివో । బ్రోవననుచు.

అక్కటా! ఏనెంత దుష్కర్ముడనోకదా! కాకున్నఁ బ్రాణ సమానురాలవగు నిన్నెడఁబాసినను నా యీజీవములు మేనుఁ బాయ లేకున్నవి. పాపీ చిరాయు వనునట్లు పాపాత్ములకు జీవితకాల మభి వృద్ధి నొందుచుండు నను టిదియే కాఁబోలును. తన్వీ! భుజబలాన్వితు లగు రక్కసులనెందఱినో నిమిషమాత్రమున వధియింపఁజాలితినేగాని నిన్నుఁగొంపోయిన దుష్టుని దెలసి రూపుమాపఁజాలనైతిని.

ఉ. అక్కట యెట్టులోర్తు దను । జాంతకుఁడెవ్వఁడో సీతఁగొంచుఁ దా
నెక్కడ కేఁగియుండెనొకొ । యింతియుఁ జింతల నెట్లు చిక్కెనో

ఎక్కడి జానకింకఁ దను । వేటికి నిక్కము శౌర్యహీనుఁడన్
వెక్కసమైనభంగి సతి । వీడిన పాపుఁడ దుర్మదాంధుఁడన్.
ఓ సాధ్వీ!

చ. కరుణ యొకింత లేక నిను । కాననసీమల నొంటిపీడఁగా
ఉరుతరశోకవహ్నిఁబడి । యోర్చున నెన్నఁడొ కాచువాఁడ నం
చరమర లేక నిల్చితివొ? । యార్తిని కాయముఁ బాసియుంటివో
తరుణిని గావలేక యిటు । తథ్యము నిల్చుట శౌర్యహీనుఁడన్.

అయ్యో! కాలమెంతవ్యర్థముగఁ బోవుచుండెను. పదునాల్గు వత్సరము లీ యరణ్యావాస మిట్లు సీతను విడనాడి దుఃఖించుటకే ప్రాప్తించెను గాఁబోలును. నాకింక సంతస సౌఖ్యములు రెండును దూరమయ్యె. ఈ తాపాగ్నిచేతనే జీవములఁ బాయుట నిక్కము

(ఆలోచనా నిమగ్నుఁడై)

ఆహా! ఏమి నావెఱ్ఱి! ఈ త్రిభువనంబుల నాకెదురై రణమున గెల్వఁజాలువాఁ డెవ్వఁడు. నా ప్రాణేశ్వరి యీలోకంబున నెచ్చట నున్నను దెలిసికొనలేకుందునా? ఆ దుర్మదాంధుని, ఆనీచునిఁ బట్టి దునుమలేనా?

[లక్ష్మణుఁడు, సుగ్రీవుఁడాది వానరులు ప్రవేశింతురు]

సుగ్రీ:—(రామునిఁ గాంచి)

(12 వ అనుబంధము)

గీ. మూఁడులోకంబులకుఁజూడ । మూలమీవు
భక్తులను జేరి దయఁజూచు । ప్రభువు వీవు
ఆర్తజనరక్షకుండవు । యమలచరిత
శరణుసైరించు శ్రీరామ । శరణుశరణు.

మహాత్మా! శ్రీరామచంద్రా!

ఉ. కాచినవాఁడవీవు నను । కాయము బాయఁగ నున్నవేళ నే
దాచిన దాగునొక్కొ మది । తాల్మివహించితి వింతకాలమున్
కాచినఁ గావకున్న నిఁకఁ । గానఁగఁజాలుదె వేఱుదిక్కు నే
నీచుఁడనంచు నెంచితివొ । నేరము లెంచకు నీరజేక్షణా.

రాము:—సుగ్రీవా! లక్ష్మణుఁడు వచ్చునందాక మా విషయమే పెడచెవిని బెట్టితివి కాఁబోలును. గతించినదానికై యోచింపనేల? ఇఁకనైన సీతాన్వేషణార్థము శక్తిసామర్థ్యంబుల నలరారు వానరుల నల్దెసలకుఁ బనుపుము.

సుగ్రీ:—ఆర్యా! ఇదివఱకే నియమించియుంటిని. ఈ హనుమంతుఁడును, అంగదుఁ డాది యీ వానరులును మిగిలియున్నవారలు. వీరిని దక్షిణదిశకుఁ బంప నుద్దేశించితిని. ఈ హనుమంతుఁడు ముల్లోకంబుల నెచ్చటనున్నను—

గీ. జానకీదేవి వీక్షించి । జాడ లరసి
వచ్చునంతటి ఘనుఁడగు । పంకజాక్ష
కార్యసాఫల్య విధాతఁడే । కనును యనఘ
తప్పదింతయు నిక్కము । ధాత్రిబలుఁడు.

రాము:—మంచిది.

హను:—(చేతులుజోడించి) తండ్రీ! రామచంద్రా! నాయదృష్ట వశమున సీతామహాదేవిని గాంచిన. నేను రామదూతనని యెట్లు నమ్మిక పుట్టసేతును?

గీ. కపటమంచును నెంచునో । కాంత నన్ను
నమ్మఁజాలక యుండునో । న్యాయమనుచు
నెట్లు బోధించువాఁడను? । యింతి కనఘ
యానవాలు నొసంగుము । యమలచరిత.

రాము:—అయిన దీనిఁ గొనిపొమ్ము.

(అని యుంగరమును దీసి యొసంగును)

హను:—(పుచ్చుకొని) మహాప్రసాదము.

గీ. అనఘు శ్రీరామచంద్రుని । యాజ్ఞఁ గొనియు
బోవుచున్నాఁడ సీతను । బోల్చనిపుడు
భాగ్యమెటులుండెనో కన । భారమగును
రామచంద్రుని కరుణచే । రామఁ గాంతు.

(అని రామునకు నమస్కరించును)

రాము:—శుభమగుఁగాక! పోయిరమ్ము. నెలదినముల గడువు మాత్రము నుంచుకొనుము. (అంగదుఁడాది వానరులతో హనుమంతుఁడు రామనామస్మరణఁ జేయుచు నిష్క్రమించుచు)

(తెర పడును)

నాల్గవరంగము—సముద్రప్రాంతము

[ప్రవేశము—హనుమంతుఁడు, జాంబవంతుఁడుఁ అంగదుఁడాది వానరులు]

హను:—అంగదాది ప్రముఖులారా! గడువుదినంబులు కూడ గతించుచున్నవి. ఇంతవఱకును సీతాదేవిజాడ లించుకయుఁ దెలియఁ జాలమైతిమి. తిరుగ నేమోముతో శ్రీరామచంద్రునిఁ జేరఁజాలుదుము? ఆ రాముఁడు మనలఁగాంచి, సీత యెచ్చటనుండెనని యడిగిన నేమని ప్రత్యుత్తరమిచ్చువారము?

జాంబ:—ఆంజనేయా! అగును. సత్యమే. తిరుగవలసిన చోట్లన్నియును దిరిగితిమి. ఎట్టి పడరాని యిక్కట్లు బడుచున్నను లెక్కించితిమా! ఇఁక జరుగవలసిన విధాన మెద్దియో నీవే తెల్పుము.

అంగ:—హనుమంతా! మే మందఱమును నీ యభీష్టము ననుసరించుయే వర్తించువారము.

హను:—

గీ. సీతఁ గనుఁగొనఁజాలక । చేరి రాము
మోముఁ దిలకింప నెట్లగు । మూలమరయ
జీవములఁ బాయు టొప్పగు । బోవఁ జాల
రామనామంబుఁ దలఁచుచు । బాము లేల?

అంగ:—అంజనీసుతా! మేమును నిన్ననుసరించుటయే కర్తవ్యము.

(ఒకప్రక్క సంపాతి పడియుండి)

సంపా:—వీర లెవ్వరో! శ్రీరాముఁడు, సీత అనుచున్నారు. సీతాన్వేషణార్థ మరుదెంచిన రామదూతలు కారుకదా! అట్లేయైనచో నా భాగ్య మేగునవచ్చును ఇచ్చోటనేయుండి వీరి వృత్తాంతమంతయు నరసెదనుగాక!

అంగ:—హనుమంతా! ఆ శ్రీరాముని వృత్తాంతము నొక్క మాఱు పూర్తిగ వినిపింపుము. పిదప నీ సముద్రమునఁబడి జీవములఁ బాయుదము. అవసానకాలమున మన కంతకన్న మోక్షదాయక మగున దింకేమికలదు?

జాంబ:—ఆంజనేయా! అట్లొనర్పుము.

హను:—

గీ. దశరధుండనఁ నొప్పెడు । ధరణిపాలుఁ
డుండె పుత్రులులేక నా । యుర్వినాథుఁ
డెన్నియో పూజ లొనరింప । నెన్నఁగడకు
సుతులునల్వురు పుట్టిరి । యతనికంత.

అందరు మొదటివాఁ డీరామచంద్రుఁడే—ఆ శ్రీమహావిష్ణువే—

సీ. తలఁచి భూభారంబుఁ । దప్పింపఁగానిట్లు
అవతరించెను రాముఁ । డనఘ భువిని
చిన్ననాటనె తాను । చేరియు నడవుల
దుష్టరక్కసులను । దునిమె నతఁడు
పాషాణమైయున్న । పడఁతి నాతిని జేసి
గౌతముకర్పించె । కరుణఁజూపి
జనకుఁనింటికిఁ దాను । చనుదెంచి వింటిని
విఱిచి భూజాతను । పెండ్లియాడె

గీ. తండ్రిపంపున వనమునకుఁ । దరలెనిట్లు
సీత, లక్ష్మణుఁ గూడి యుఁ । జెప్పవశమె
అతని మహిమంబు చాలిని । హాత మొనర్చె
ఇదియె శ్రీరామచరితంబు । నెన్నతరమె?

సంపా:—మహాత్ములారా! మీ వలన శ్రీరామునికథనువిని, శాపమునుండితొలఁగి యెప్పటివలె ఱెక్కలనుగల్గి సుఖమందినాను. నా నామము సంపాతియందురు. సీతామహాదేవిని రావణుఁడు కొంపోవుటను గనులారఁ గాంచియు, శక్తిజాలక యూరకున్నాను. ఇప్పుడాపె లంకయందే యున్నది. ఏను జటాయువునకు సోదరుఁడను, ముదుసలినగుటచే లంకకుఁ బోఁజాలను.

హను:—పక్షీంద్రా! సీతావృత్తాంతముఁ దెలిపి మా ప్రాణములఁ గాచినందులకు మే మెంతయు నీకుఁ గృతజ్ఞులము.

అంగ:—ఇంకఁ గొన్ని శుభసూచకములే కనవచ్చుచున్నవి. కాని, శతయోజనంబులు పరిమితిగల యీ యంబుధిదాఁటి, లంకను జేరువా రెవ్వరు?

(అందఱు నిశ్చేష్టులై నిలువఁబడుదురు)

జాంబ:—ఏ నన్నియోమాఱులు సునాయాసముగఁ బోయియుంటినికాని యిప్పుడు ముసలినగుటచే నేను పదియోజనంబులకంటె నెక్కుడు లంఘింపజాలను. అంజనీసుతా! హనుమంతా! నీ శక్తిని నీ వెఱుఁగవు. నీవు బాల్యమందు రవిని జేరి విద్య నభ్యసించిన మహానుభావుఁడవు. నీవు తలంచిన నిట్టి శతయోజనములు పెక్కింటిని దాఁటఁగల్గుదువు. శ్రీరాముఁడు నీ శక్తిసామర్థ్యంబుల నెఱింగియే, ముద్రిక నానవాలుగ నీ కొసంగెను. నీవుతక్క నితరు లా లంకను జొచ్చుటయు, సీతజాడ లఱసివచ్చుటయుఁ గల్ల. ఇందులకు నీవే సమర్థుఁడవు. నీవు తిరిగి వచ్చునందాఁక మే మిదే కాచియుండెదము.

అంగ:—హనుమంతా! ఇంకను కాలయాపన మేల? స్వైరంబుగ బయలుదేఱుము.

హను:—అయిన నిఁక సందియ మెందులకు? ఆ శ్రీరామచంద్రుని కరుణయే యున్నతఱి సర్వార్థసిద్ధిని బడయకుందునా? పోయి వచ్చెదను.

అందఱు:—శుభమగుఁ గాక.

(రామస్మరణఁ జేయుచు హనుమంతుఁడు నిష్క్రమించును)

(తెర పడును)

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# లంకాదహనము

అను

# విభీషణపట్టాభిషేకము

## చతుర్థాంకము

### లంకాపుర వీధి

[(ప్ర)వేశము—హనుమంతుఁడు]

హను:—అయ్యో! ఈలంకాపురమంతయు నిల్లిల్లు వెదకుచుఁ జుట్టివచ్చితి గాని నాపాప మేమియో—

ఉ. సీతను గాంచనైతి నిఁకఁ । జేయున దేమిటొకో హతక్కటా

పాతకమంచు నెంచకను । భామను రక్కసు లేమి చేసిరో

భీతిలి రాముఁ జేరనవి । వీడెనొ జీవము లార్తి సొక్కుచున్

హా! తరుణీలలామ వడి । నారయఁజాలను నంచు నెంచితిన్.

కటకటా! ఇం కేమి సేయుదును?

సీ. శ్రీరామచంద్రుండు । సీత యేమనెననఁ

బ్రత్యుత్తరం బేమి । పల్కువాఁడ?

ముద్రికఁ బ్రేమతో । ముదిత గైకొనెనే మొ

తెల్పుమనగ నేమి । తెల్పువాఁడ?

సుగ్రీవుఁ డరుదెంచి । సుదతి యొందుండెనో

చెప్పుమనగ నేమి । చెప్పువాఁడ?

సౌమిత్రి ననుఁజూచి । సాధ్వికిఁ గుశలంబె
నుసువుమా యన నేమి । నుడువువాఁడ?

గీ. కడకు సంతసమంతయు । గడచిపోయె
జానకీదేవిఁ గాంచక । స్వామి రామ
చంద్రు వదన మేరీతిని । సాహసించి
చూడఁజాలుదు నేనింక । సొబగుదక్క.

హా! పతివ్రతాతిలకమా! సీతా! ఎంతైన జీవకులంబులో నుంటివో లేక యీదుష్టరక్కసుఁడు రావణుఁడాడు పల్కులకునోడి విగత జీవివైతివో కదా తల్లీ! నీ క్షేమసమాచారము లరసి నీ వృత్తాంత మా శ్రీరామున కెఱింగించి సంతసింపఁజేసెడు మహాభాగ్య మొదవు నని యెంచియుంటినే కాని యిట్లు నిరర్థకుఁడ నగుదునని తలపోయ లేను కదా. జననీ! నినుఁబోలు సాధ్వీమతల్లుల కిట్టిపాట్లు జనింప లోకము లెట్లు భస్మీభూతములు కాకుండ నిలువఁజాలెనో? ఆదశకంఠుని శిరము లొక్కుమారుగ సీతాపాగ్నిచే నేల దహింపఁబడకుండెనో? అక్కటా! ఇఁక నేనిందు సీతామహాదేవిని ఆదిలక్ష్మినిఁ గాంచఁజాలనా? ఎన్ని శ్రమలకోర్చి తుదకింతుఁ జేరనను నదియు నిష్ఫలంబయ్యెనే! ఇఁకఁ గర్తవ్యమేమి? (ఆలోచన నభినయించి) ఆలోచన కేమున్నది? ఏనిప్పుడు సీతజాడ లరయక రామునిఁ జేరఁబోతినా? తత్క్షణమే యామహానుభావుఁడు మేనుబాయుట నిశ్చయము. వాని వెనువెంటనే లక్ష్మణుఁడును మృతినొందును. అదంతయుఁగాంచి సుగ్రీవాదులు జీవములవీడుదురు. రామలక్ష్మణుల వృత్తాంతము తెలిసినతోడనే భరతుఁ డాది శ్రీరాముని బంధుమిత్రాదు లందఱును విగతజీవు లగుదురు. వారందఱి మృతికిని గారణభూతుండ నేనే యగుదును. అట్టి మహా పాతకమున కొడంబడుటకన్న నేనిందే ముందుగ నసువుల వీడు టుచి తము. హా! విధాతా! ఎంతముప్పుచు ఘటిల్లజేసితివి? నా శక్తి

సామర్థ్యము లన్నియు తుద కీరీతిని ప్రాణత్యాగమునకుఁ గారణ భూతము లయ్యెనా? రామునియెడ నాకుఁగల భక్తియంతయుఁ దుద కిట్టివార్తను జెప్పుటకు వినియోగించెనా? ఏనిప్పు డేరీతిని ప్రాణములఁ ద్యజించువాఁడ? (అని నలువంకలఁ జూచి) అదిగో! ఏదియో యుద్యానవనమువలెఁ దోచుచున్నది. అందునఁ గూడఁ దిలకించి పిమ్మటఁ జేయవలసినపనులఁ బూర్తిచేసెదను.

(అని నిష్క్రమించును)

(తెర పడును)

---

రెండవరంగము—అశోకవనము

[చుట్టును రాక్షసస్త్రీలు కావలియుండ సీత యొక వృక్షచ్ఛాయను గూర్చుండి యుండును]

సీత:—

(13 వ అనుబంధము)

సీత:—(దుఃఖముతో) హా! రామా! రామా! ఇఁక నాకిందుండి ముక్తియే లేదా? నీ ముఖారవిందమును దిరుగ నీకన్నులఁ జూచుభాగ్యము నశించెనా? అయ్యో! నాథా! అది నిక్కమగు హరిణముకాదు. రాక్షసమాయ యని నీవెన్నివిధముల బోధించినను వినక తత్ఫల మిప్పా డనుభవించుచుంటిని. ప్రాణేశ్వరా! క్షణకాలమైన మీముద్దుమోమును దిలకించక యుండజాలకపోవుటచేఁ గదా! వలదన్నను వనములకు వెంటనంటి వచ్చితిని. ఏనెంతటి పాపాత్మురాల నగుటచేతనో యట్టిభాగ్యముకూడ నశించెను. కటకటా! ఎట్టు

లోర్తునే? నా యీదుఃఖమున కంత మెన్నఁటికైనకల్గునా? ఈ దుష్టా త్ముఁ డెన్నటికైన మరణించునా? లక్ష్మణా! నీపల్కులయందలి యర్థ మొకింతయుఁ దెలియక యెట్టిదుర్భాషలాడి నీమనమును నొవ్వఁజేసి తిని? సన్మార్గుల దూషించిన ఫలితమే యిదియని యిప్పటికిఁ దెలిసి కొంటిని. రామా! కరుణాపారీణా!

ఉ. ఏవిధి రావణాధముని । నెన్నఁడుబట్టి వధించు వాఁడవో
ఏవిధి దుఃఖమార్పగను । నెంచియు నీవిధిఁ బాగుఁజేసెదో
బ్రోవగఁదల్పకున్న నిఁకఁ । బ్రోచెడువారెవరయ్య నాథ యీ
పావనమూర్తి భక్తజన । ప్రార్థన లెంచుము శీఘ్ర మొప్పునే.

నాథా!

గీ, జాలమున కోర్వ నిఁక దను । జాంతకా ఖలు
రావణునిబట్టి దునిమియు । రామ నన్నుఁ
జేరఁదీయవె కరుణయే । తీరెనెమొ?
బ్రదుకుదానను నిన్నుఁజూడు । భాగ్యమున్న.

అయ్యో! ఇఁకను నీదురదృష్టవంతురాలు శ్రీరామునిఁజూడఁ జాలునా? అట్టిభాగ్యమేయున్న నిట్టి యిక్కట్టులు సంభవించును?

[ప్రవేశము—రావణుఁడు]

రావ:—

ఉ. కాంతరో రామరామ యని । కాలము బుచ్చుట కేమియయ్యె నీ
కాంతుఁడె యాతఁడైన నిను । గానలపాలును జేసి పోవునే
యింతియొకాక సౌఖ్యమట । నేవిధి కల్గును సాధసీమలన్
వంతలఁబొంచుబల్కుదువు । భామరో సంతసమంద కీయెడన్.

తన్వీ!

గీ. రత్నసౌధములందుండి । రమణి నన్ను
సంతసాంబుధిఁదేలించి । సౌఖ్యపడక
మానవాధము నొక్కని । మనసునందు
నిల్పి చింతలఁజిక్కుట । నీతియగునె?

ఆరాముని జేపట్టి యాతదనుక నీవెట్టి సంతససౌఖ్యము లనుభవించితివో తెలిసియు నిట్లు కుందనేల? నాతోడఁ గూడియున్న నీకు వలయు వస్తువాహనములెల్లఁ గోరుటయె తడవుగఁ దెచ్చి యర్పింతును. చీరినంతనే చేతులమోడ్చి యాడిగములొనర్చు దాసదాసీజన మెందఱోకలరు. వసించుటకా లెక్కకు మిక్కుటంబగు బంగరు మేడలున్నవి. ఇట్టిసౌఖ్యము లెడఁబాసి ఘోర మృగ నివాసంబగు కాననసీమల వసింపనేల? ఇంతయేల? నా పట్టపుదేవియగు మండోదరిచేతనే నీకుఁ బరిచర్యల సేయింతును.

చ. అనయము నిన్నువీడ నెపు । డాదరమొప్పగ సేవఁజేసి నా
వినయముఁ జూపెదింక సతి । వేగమె కావలె నీకృపారసం
బున ననుముంపఁజేయు మతి । మూర్ఖతనెల్లునె యోర్వఁజాలుదే
వనముల సంచరించు వెత । వారిజనేత్రికి భామ కేటికిన్!

గతించినవానినిగూర్చి విచారింపక యికను నట్టియుడుము అందుటకే యత్నించుచుంటివా? నినుఁబోలు మూర్ఖులీజగమున వేఱొక్కరుండరు. ఇఁకనైన వానినుండి నిమనమును దొలగించుకొనుము. రమ్ము నాయందఁజేరుము. సౌఖ్యమందుము. నరుఁడేల? సుఖంపఁజేయుకేల?

సీత:—(తనలో)ఊరకొన్నకొలఁదిని యీదురాత్ముని దుర్భాషలతిశయించుచున్నవే. కటకటా! ఎట్టిదుర్దశ ప్రాప్తించెను. (ప్రకాశముగా) ఓరీ! మూర్ఖా! నీ పూజలన్నియు నేఁ డేమంటఁగల్పితివి. స్త్రీలోలుండవై యిట్లున్మాదునివై వడి చరించుట తగునా? ఆ శ్రీరా

ముఁడు సామాన్యమానవుఁడని యెంచుచుంటివి కాఁబోలును. ఎంద
ఱొందరి దుష్టులఁ బరిమార్చెనో వినలేదా? అతఁడేమియు సేయఁ
జాలని యబలుఁడనియే నీకు నమ్మికయున్న చోరునిభంగి రామలక్ష్మ
ణులు దఱిలేనివేళ నన్నేలకొనివచ్చితివి. ఇంతియేకాక అంతదూరము
పోనేల?

గీ. పరవనితల సాంగత్యంబు । పాపమంచు
నెఱుఁగవే యిట్లువంచింప । నెట్లుతోఁచె
ఎందఱొందఱు మడిసిరి । యింతులనుచు
మూర్ఖతనుఁగ్రుంగి తలపవే । మూఢచిత్త.

రావ:—ఓహో! నాకు నీతులఁగఱపుచుంటివా? ఆరాముని
నామము నుడివి ప్రగల్భములఁ బల్కినంతనే భీతిలువాఁడ నని యెంచు
చుంటివి కాఁబోలును. ఈ ముల్లోకంబుల నా కెదురగువారే లేరు.
ఇఁక నొక మానవమాత్రునిచే నే మడియువాఁడనే. ఇంతియెకాక
శతయోజనంబుల నిడివిగల యీ వారిధిదాఁటి వచ్చునకదా రాముఁడు
సమరమునకు గడంగుట.

చ. రమణిరో యేటిచింత లిఁక । రాముఁడుగానుగ పత్నిపీడగన్
సమమెవ రెంచుఁజూచినను । సాధ్యముకాదుగ నన్నుగెల్వగా
యమునలెవచ్చిమ్రొక్కెదురు । యీరయనింకను రాముఁడేడనో
సమరముఁజేయుటట యిది । సత్యము కాంతరో లెమ్మురమ్మికన్.

సీత:—అధమాధమా!

ఉ. పుట్టితి బ్రహ్మవంశమనిఁ । బొంగెదవేటికి నీచకృత్యముల్
పుట్టినఁదోప నీవుకద । పుణ్యముపాపము దుర్మదాంధ నీ
పట్టునువీడి రాము పద । పద్మములన్ స్మరియించి వేడినన్
ఎట్టి యనర్హుఁడైనఁ గృప । నీర్ష్యనుబూనక కాచునాతఁడే.

నీ దురూక్తుల నింకనైనఁ గట్టిపెట్టుము. దుష్టాత్మా! నిన్ను నిమిషమాత్రమున శాపదగ్ధునిగ నొనర్పుట కేనే చాలుదు. కాని శ్రీరాముఁడే వచ్చి నిన్ను సంహరించి పౌరుషమును నిల్పుకొను నని యూరకున్నదానను.

హను:—(దాపుననే యొకవృక్షముపైఁ గూర్చుండి)

(14 వ అనుబంధము)

అయ్యయో! ముల్లోకనాథుండగు శ్రీరామమూర్తికి ధర్మపత్నియై పతివ్రతాతిలకమని ప్రసిద్ధివడసిన నీ కాంతాలలామ కెట్టి దురవస్థ ప్రాప్తించినది. రామాజ్ఞ లేకపోయెనుగాని యీ దుర్మదాంధుని, ఈ నిచప్రవర్తకుని, కామాంధకారుని నిమేషకాలమున హతమొనర్చియుండనా!

రావ:—సీతా! నీవెంత దూషించినను నవి నీయందుండెడు ప్రేమాతిరేకంబున భూషణము లగుచున్నవి. ఇఁక రామునివలన మరణమందువా? రాముని సామర్థ్యము నే నెఱుంగనివాఁడనుగాను. ఆ మానవాధమునిఁ జేరి నేను శరణుఁజొచ్చువాడనా? అతఁడు నన్ను సైరించికాచునా? ఆహాహా! ఏమి నీపలుకులు?

సీత:—ఓరీ! రాక్షసాధమా! "వినాశకాలే విపరీతబుద్ధిః" అనువాక్య మసత్యమా! నీ కవసానకాలము ప్రాప్తించినది. ఇట్టివేళ బుద్ధులఁ గఱపినను నిష్ప్రయోజనమే.

రావ:—(కోపముతో) సాహనముగ వేచుచున్న కొలఁదిని దూషణ లతిశయించుచున్నవి. నిన్నీక్షణముననే వధించెదను. ఎవ్వ రడ్డుకొందురో చూచెదను. (అని ఖడ్గమునుబూని వధింపబోవును) (మరల వెనుకకుతగ్గి) సీతా! నీకు రెండుమాసములు గడువొసంగితిని. సరిగ నాలోచించుకొనుము. జరుగవలసిన వన్నియు జరిగినవెనుకఁ

జంతితివి నేమిప్రయోజనము. ఓ రాక్షసాంగనలారా! మీా రెల్లరు నీమె నొడంబడఁజేయుఁడు. ఎంతకును వినకున్న నప్పుడే తగిన ప్రాయశ్చిత్తము కాగలదు. (అని నిష్క్రమించును)

హను:—ఈదురాత్ముఁడు వదలినాఁడు. పోవుదునా? (ఆలోచించి) ఈ రాక్షసస్త్రీలును వదలుదురేమో కొంత సేపరసి మఱియుఁ బోయెదనుగాక.

సీత:—హా! రామచంద్రా! ఇంకేమి తెరువు? ఈదురాత్ముని పల్కులకుఁ జెవియొగ్గి జీవములతో నెట్లు భరించుదాన? నాథా! నీ వెన్నఁటికైనఁ దిరుగ నిందుఁజేరి యీ రావణుని దునుమాడి నన్ను జెఱను విడిపించెదవా? లేక నేనిచ్చోటనే యసువుల వీడుటకు నోచుకొంటినా? అయ్యో! నీ మృదుమధురాలాపము లీచెవి నిఁక నెన్నఁడు సోకి యీ దుఃఖార్తిని వీడఁజేయునోకదా?

గీ. కోపమూనియు వీడితో । కోమలాంగ
కాక వెదకఁదొడంగితో । కరుణహృదయ
ఎటులభరియింతు నీయార్తి । నెంతదనుక
సైపఁజాలుదు జీవముల్ । సానుభూతి.

రా॥ స్త్రీ:—ఓసీ! ఎందులకీరీతి సతతముఁ గన్నుల నీరు పెట్టెదవు? లక్ష్మి రానున్న వేళ మోకాలొడ్డువా రుందురా? రావణుఁడన సామాన్యుఁడని యెంచుచుంటివి కాఁబోలును. ఆ రాక్షసేంద్రుఁడు తలఁచిన యిట్టిరాములను పదిమందినైన రూపుమాపగలడు. ఇఁకనైన బుద్ధి తెచ్చుకొనుము. రావణుని జేరి సుఖింపుము. రాముఁడు రాముఁడంచు యూరక యేల వాపోయెదవు?

రెం॥ స్త్రీ:—సీతా! చూడుమిప్పుడే నిన్ను మ్రింగివైచెదను.
(అని మీాది కుఱుకఁబోవును)

సీత:—(భీతినొందును)

[ప్రవేశము—త్రిజట]

త్రిజ:—రాక్షసాంగనలారా! మీ కేల యీ యార్భాటముల్ ఇటురండు. ఇప్పుడే నేనొక కలఁ గనియుంటిని.

రా-స్త్రీలు:—ఏమేమీ! కలయా! భయమా! చెప్పుచెప్పు.

త్రిజ:—ఈ సీతాదేవి భర్తయగు శ్రీరామచంద్రుఁడు వానరుల సాహాయ్యమున వారధిదాఁటి, లంకనుజేరి, పుత్రమిత్రకళత్రాదులతో రావణుని నాశనముగావించెను. అయ్యో! భీతిజనించుచున్నది. ఇట్లు జరుగుట నిక్కము, మీ రీ పతివ్రతాశిరోమణిని శక్తియున్న నోదార్చుఁడు. కఠినవాక్యములఁ బలుకకుఁడు.

రా-స్త్రీ:—చెలులార! నురలవత్తమురండు. ఇంతలో నీమెయొంటిమెయి నాలోచించుకొనును. (అని త్రిజట తక్క తక్కిన స్త్రీలు పోవుదురు)

త్రిజ:—అమ్మా! సీతాదేవీ! ఊరడిల్లుము. నీ పతి తప్పక కొలఁదికాలమున నిచ్చోటకుఁజేరి, యీ దుష్టరక్కసుల నెల్ల వధించి, నిన్ను గొంపోఁగలఁడు. నా మాటల నమ్ముము. సత్యము.

సీత:—చెలీ! అట్టిభాగ్యమొదవునా? నీవే నాకిందు దిక్కు. నీ పల్కులే నే జీవింప నాధారభూతములు.

త్రిజ:—తల్లీ! ఇప్పుడే వచ్చెదను. చింతదక్కియుండుము.

(అని నిష్క్రమించును)

హను:—ఈ సాధ్వితో మాటలాడుట కిదియే యదను. ఎట్లు పలుకరించువాఁడ. ఏ నట కేగి రామదూతనన్న విశ్వసించునో? విశ్వసింపదో కదా. (ఆలోచన నభినయించి) శ్రీరామచరిత్రను ముందుగ వినిపించెదను.

సీ. దశరథపుత్రుఁడై । ధరణి నవతరించి
చిఱుతప్రాయమునాఁడె । చేరె నటవి
దుష్టరక్కసులను । తునుమాడి కౌశికు
యాగంబుకాచినా । డంత గాతి
నాతిగఁజేసియు । సీతను బెండ్లాడ
హరువిల్లు నవలీల । విఱిచినాఁడు
తండ్రియాజ్ఞనుగొని । తతలివనంబుల
జానకిఁ గోల్పోయి । చనియుఁబిదప
గీ. వానరాధిపు సుగ్రీవు । వరుస జేరి
వాలిఁగూల్చిన శ్రీరాము । వార్తఁదెల్పు
నేఁగుదెంచితి నమ్మగో । యిందుఁజేర
రాము మహిమంబు వర్ణింప । రామ! వశమె.

సీత:—(నలువంకలఁ దిలకించి) ఆహా! ఎవ్వరిందు రామచరిత్రమును బఠనసేయువారలు. (హనుమంతునిఁ గాంచి) ఈ వానరుఁడెవ్వఁడు? మరల నెవఁడో రక్కసుఁడు నన్ను వంచింప నీరీతి వానర రూపమును దాల్చి వచ్చియుండనోపు. హా! శ్రీరామచంద్రా! శ్రీరామచంద్రా!

సీ. ఏనాఁడు నినుఁజేరి । యిందిరారమణా నీ
ముద్దుమోమునుగాంచి । మురియనగునె
ఏనాఁడు నినుగని । యింపారుపల్కుల
వీనులవిందుగ । వినగనగునె
ఏనాఁడు వీక్షించి । యనకులేశ ముదమార
రఁగ నిను భజియింప । నగునెనాకు
ఏనాఁడు నీపాద । మెలమి నే భక్తితో
సేవించు భాగ్యముఁ । జేరనగునె

గీ. ఇన్ని సౌఖ్యంబు లెప్పుడైన । సన్నుతాంగ
గాంచఁగల్గుదునో లేదొ । కమలనయన
పాపఫల మీరీతిని । బరఁగఁజేసె
కటకటా యెట్లుఁ బోర్తును । కాంతుఁబాసి.

(హనుమంతుఁడు వృక్షమును దిగి వాయుజని నమస్కరించి)

15 వ అనుబంధము

హను:—జననీ! సీతాదేవీ!

గీ. సందియంబేల మది నిట్లు । సచ్చరిత్రుఁ
డైన శ్రీరామబంటను నే । నమ్మునమ్ము
రాముపంపున వచ్చితి । రమణి నిజము
వసుధ హనుమంతుఁ డనఁగను । వరలువాఁడ.

సీత:—(తలయెత్తిచూచి) హా నాథా! ఈ రాక్షసమాయలఁ దాటి యెట్లు బయల్పడుదు గాన?

హను:—తల్లీ! ఇంకను శంకయేల? నేను రక్కసుడను గాను. నిజమైన రామభక్తుఁడను. శ్రీరామునివలన నే నీ జాడ లరయుటకుఁ బంపఁబడితిని.

సీత:—(సంశయకులాత్మయయ్యు) శ్రీరామునకుఁ గుశలమే కదా. లక్ష్మణుఁడు క్షేమమున నలరారుచున్నవాఁడె?

హను:—ఇరువురకును క్షేమమే. ఇదిగో! ఇట్లు నీవు నమ్మకపోవచ్చునని యొకవేళ సందేహముతోఁడ నీ ముద్రిక నొసంగుమని నా కొసంగె. (అని ముద్రిక నిచ్చును)

సీత:—(పుచ్చుకొని కన్నులనద్దుకొని) ఓ ఉంగరమా!

ఉ. ఎన్ని దినంబులాయె నిను । నేఁ గని కన్నులకాసదీఱ నా
కన్నను నీవె యెక్కుడగు । కాంతునిఁబాసి తపించుచున్న నీ

కెన్నోవిధంబులఁ బలికి । యీ వలవంతను నూన్ప జేయుగా
గ్రన్ననవచ్చి తుంగరము । గౌతుకమయ్యెను నిన్నుగాంచఁగాఁ.

హనుమంతా! నా నాథుని క్షేమసమాచారమును దెల్పి నా జీవములగాచి పుణ్యము గట్టుకొంటివి. నీ ఋణ మెట్లు తీర్చుకొనగల్గుదును. నా నాథుఁడు నన్నరయుట కేమియత్నములు గావించుచుండెను? లేక విసుగుజనించి యూరకుండెనా? మఱది లక్ష్మణుఁడు తన్ను దుర్భాషలాడినందుకు నన్నింతగ నిందించుచుండెనో కదా! నిష్కారణముగ నా మహానుభావుని దూషించినందులకే నా కిట్టి యకారణయిడుములు ప్రాప్తించి కుందుచుంటిని.

హను:—మాతా! ఆ రామలక్ష్మణులు నిన్ను వీడినదాదిగ నిద్రాహారములు విసర్జించి, యున్మాదులకై వడి చరించుచున్నారు. కొన్నాళ్ళకు వానరాధిపతియగు సుగ్రీవునితో సఖ్యమొనర్చి, వాలిని గూల్చి, యాతనికిఁ గిష్కింధాపురమును బట్టముగట్టినారు. వారి యనుమతి ననుసరించి సుగ్రీవుఁడు వానరుల నల్దిశలకుఁబంప, నా పుణ్యవశమున నే నిందుఁజేరి మిమ్ములఁ గంటిని. జననీ! ఆ రామచంద్రుఁడు వానరబలమునుగూడి, కొలఁదికాలముననే నిన్ను జెఱ విడిపింపఁగలఁడు. తల్లీ! అంతయేల? సెలవగునెడ నేనే క్షణకాలమున నిన్ను శ్రీరామచంద్రునికడకుఁ జేర్పఁగలను.

సీత:—(ఆశ్చర్యచకితయై) అంజనీసుతా! నీ రూపమునుజూడఁ జిన్నదిగనున్నది. నీ వెట్లు నన్ను గొంపోయెదవో తెలియఁజాలకున్నాను.

హను:—నీకట్టి సందియమేల? నా నిజరూపమును జూపెదఁ గాంచుము. అప్పుడైన నమ్మిక జనించును.

(16 వ అనుబంధము)

(అని నిజరూపమును దాల్చును)

సీత:—(భీతి నభినయించుచు) హనుమంతా! శ్రీరామభక్తాగ్రేసరా! నీ శక్తి యపారము. భీతిజనించుచున్నది ఇక చాలించుము.

(హనుమంతుడు మొదటిరూపమున నిల్చును)

సీత:—ఆంజనేయా! నీవే నన్నుఁ గొంపోవ సమర్థుఁడవు. కాని యట్లైన శ్రీరామునకు శక్తిలేక, రావణునివలెనే చోరునిభంగిఁ గొనిపోయెనని నాథునకు నిందగలుగును. కాన యందులకుఁ బాల్పడఁజాలను. నీవేగ, యా రామచంద్రునితో నా వాక్యములుగా నిట్లు నుడువుము. "ప్రాణేశ్వరా! మిమ్ములఁ బాసినదాదిగ నేఁ బొందు యిక్కట్టెట్టిదియొ తెలుపఁజాలను. ఈ దుష్టరక్కసుని, యీ దశకంఠు నెన్నఁడు గూలిచి నను జేరదీసుకొందురో. నాథా! రావణుఁడు రెండునెలలు గడువుంచిపోయెను. ఇఁక నీ మోమును విలోకించక నిలువనోపను"

హను:—అమ్మా! అట్లే చెప్పి కొనివచ్చెదను. ఇఁకఁ జింతఁ దక్కియుండుము. సెలవొసఁగుము.

సీత:—లక్ష్మణునితోఁ గ్రోధముడిగి నా తప్పులను సైరించి, నన్ను విడిపింప యత్నించుటకు వేడితినని చెప్పుము. పోయిరమ్ము. ఈ శిరోమణిని నా నాథున కానవాలుగఁ జూపుము.

హను:—జననీ! నాదొక ప్రార్థన. ఈ వనమునఁగల ఫలములఁ గొన్నిటిని దినిపోయెదను.

సీత:—అయ్యో! ఈ రక్కసు లూరకుందురా?

హను:—తల్లీ! నీ సెలవగునెడ వారిని నేనే కాచికొందును.

సీత:—త్వరపడకుము. వలయుఫలములఁ గొనుము.

(హనుమంతుఁడు నిష్క్రమించును)

(తెర పడును)

## మూడవరంగము—రావణుని కొలువుకూటము

[ప్రవేశము — రావణుఁడు, విభీషణుఁడు, హనుమంతుఁడు, ఇంద్రజిత్తు, ప్రహస్తుఁడు, యితరరాక్షసులు]

రావ:—(ఇంద్రజిత్తునిఁ గాంచి) ఈ వానరాధముఁడేకదా! యశోకవనమెల్ల ధ్వంసమొనర్చి, యనేకమంది రక్కసులను బరిమార్చినది.

ఇంద్ర:—అగు నీతఁడే.

రావ:—ప్రహస్తా! వానినిజవృత్తాంతమేమియో కనుగొనుము.

హను:—ఓరీ! రావణా! ఏ నెవ్వఁడనో తెల్పెదను వినుము. తొల్లి నినుఁ జెఱపట్టిన—

సీ. కార్తవీర్యార్జును । గడతేర్చి యున్నట్టి
పరశురాముని భంగి । పఱచినాఁడు
వాలముచే నిను । వారధులనుముంచి
యీడ్చి తెచ్చిన వాలి । నిడ్చినాఁడు
జానకికై నీవు । జనకునింటను జేరి
విఱువఁజాలని విల్లు । విఱచినాఁడు
తపసిజన్నముఁ గావఁ । దాటకిఁ దునుమాడి
సాటియే లేరంచు । చాటినాఁడు

గీ. దుష్టరక్కసులన్ బట్టి । ద్రుంచినాఁడు
దునుమనున్నాఁడు నిన్నును । దుర్మదాంధ
అట్టి యనఘుఁడు ధీశాలి । యనగనొప్పు
రామదూతను నేనురా । రావణుండ.

నా పల్కుల నాలించుము. ఆ పతివ్రతామతల్లిని, సీతాదేవిని జెఱఁగొనివచ్చుట నీయట్టివానికిఁ దగదు. ఆ శ్రీరాముఁడు మానవ

మాత్రుఁడని మోచకుము. ఆ మహానుభావుఁడు తలచినంతనే మూఁల్లో
కంబుల సృష్టింప, శిక్షింప సమర్థుఁడు ఇంతయేల? ఆ మహావిష్ణువే
భూభారమును దీర్ప నిట్లవతారపురుషుఁడై జననమందెనని నమ్ముము.
సీతాదేవి మహాలక్ష్మి. మూఢచిత్తుఁడనై యిట్లకారణముగ నెందులకు
జీవములఁ బాసెదవు? ఇఁకనైన బుద్ధిఁగలిగి—

చ. అవనిజఁగొంచుబోయి మను । జాధిపుఁజేరియు బ్రోవుమన్న రా
ఘవుఁ డసమానధీరుఁడు య । ఘుంబులఁ బాపెడుదివ్యమూర్తియౌ
యవనిజనించి భారమును । వార్పగఁజూచెడు యాదిదేవుఁడే
అవి యివియంచుఁ దప్పులను । నారయకే నినుగాచు నిక్కమౌ.

రావ:—(క్రోధముతో) విభీషణా! ఈతఁడు మనలంకఁజొచ్చి
చేయరాని పనులఁజేసియు, నింకను నేమేమియో ప్రేలుచున్నాఁడు.
కాలయాపన మెందులకు? వధింప నాజ్ఞనిడెదను.

విభీ:—రాక్షసేంద్రా! దూతయైన నీతని వధించుట పాడి
కాదు. విడచిపుచ్చుటయే ధర్మము.

రావ:—అయిన నూరక విడువరాదు. (సేవకులనుగాంచి)
ఓరీ! ఈ కోతిని గొంపోయి వాలమునకు గుడ్డలఁజుట్టి యంటించి వదలి
వేయుఁడు.

హను:—ఇదియును గొంత లాభకారియే. ఇందుచే నా యభీ
ష్టమునెఱవేరునట్లే లంకను గాల్చి మఱియును బోయెదను.

(అని యా సేవకులతోఁ నిష్క్రమించును)

(తెర పడును)

## నాల్గవరంగము—అశోకవనము

(17 వ అనుబంధము)

సీత:—పవనతనయా! వెంటనే రామునికడకుఁ దిరిగిపోక, యీ యుద్యానవనముల నేల పాడుచేసి, రక్కసుల పనుపరాడితివి. నీ వాలమునకు నిప్పంటించుట కా రావణుఁ డాజ్ఞనొసంగెనని విన్నప్పటినుండియు నా మనమున భీతి జనించెను. అయ్యో! నీ కెట్టిముప్పు ఘటిల్లెనోకదా!

గీ. రామనామంబె మదినెంచి । రాత్రిందివలు
భక్తి నాథునిఁ గొల్చుచు । పరగుచున్న
పాతివ్రత్యమహిమ ఘన । పటిమయున్న
పవనతనయుఁడు సుఖమున । వరలుగాత.

[ప్రవేశము—హనుమంతుఁడు]

హను:—(చేతులమోడ్చి) జననీ! జానకీదేవీ! భవదీయకరుణా కటాక్షమున సుఖినైయున్నాఁడను. లంకాదహన మొనరించు వేళ మీ కెట్టికీడుమూడెనో యని భయమంది తిరుగ మిమ్ముల దర్శించి పోవ నేతెంచినాఁడను. ఇదే పోవుచున్నాఁడను. సెలవొసంగుఁడు.

సీత:—ఆంజనేయా! నీ భక్తిసామర్థ్యములు వర్ణనాతీతములు. నీ వెందులకైన సమర్థుండవే. శుభమగుఁగాక! పోయి వేగముగ రామలక్ష్మణులఁ దోడ్కొనివచ్చి నన్ను విడిపింపుము.

హను:—చిత్తము. (అని నిష్క్రమించును)

(తెర పడును)

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# లంకాదహనము

అను

# విభీషణపట్టాభిషేకము

## పంచమాంకము

### మాల్యవంత ప్రాంతము

[ప్రవేశము — రాముఁడు, లక్ష్మణుఁడు, సుగ్రీవుఁడు, కొందరు వానరులు]

సుగ్రీ:— ఆర్యా! శ్రీరామచంద్రా! ఇంకను సందియమేల? దక్షిణదిశ కేగిన అంగదుఁడాది ప్రముఖులు సీతజాడ లరసియేయుందురు. లేకున్న మధువనమును బాడుసేయుటకు సాహసింపరు.

రాము:— వారికై కబురు పంపియుంటివికదా!

సుగ్రీ:— అదిగో! సందడియగుచున్నది. వచ్చుచున్నటులున్నది.

[ప్రవేశము — హనుమంతుఁడాది వానరులు]

(అందఱును శ్రీరామలక్ష్మణులకును, సుగ్రీవునకును నమస్కరించును)

జాంబ:— ఆంజనేయా! మన మెట్టివార్తను దెల్పుదుమోయని వేచియున్న శ్రీరామునకు జానకీ వృత్తాంతమంతయును వినిపింపుము.

రాము:— హనుమంతా! సీతను గాంచివచ్చితివా?

గీ. అవనిజను గాంచివచ్చితే । యాంజనేయ
సీత యేమని చెప్పెనూ । శీఘ్రగతిని

ఎటులసైపగఁ జాలెనో । యింతి నన్నుఁ
బాసి యెఱుఁగదు యొన్నఁడు । పలుకు లేమి?

సుగ్రీ:—పవనతనయా! భక్తాగ్రేసరా! కాలయాపన మేల? వేగముగ వెలిఁబుచ్చుము.

(18 వ అనుబంధము)

హను:—స్వామీ! శ్రీరామచంద్రా! సీతా మహాదేవిని గాంచివచ్చితిని.

లక్ష్మ:—ఆహా! ఎంతులకైన సమర్థుఁడ వీవేకదా!

హను:—ఆర్యులారా! ఆముల్లోకజనని సీతామహాసాధ్వి యనుభవించుచున్న దురవస్థ నేమని తెల్పువాఁడ? నిరతము తదేకధ్యానంబున "రామ రామ" యనుచు కన్నీరుమున్నీరుగాఁ బ్రవహించుచుండ రాక్షసస్త్రీలు దరిఁజేరి పలుకరాని దుర్భాషలఁ బల్కుచుండ సహింపనోపక, యా హా! నేక్షణ సింగంబులనడుమఁ జిక్కిన బాలకురంగంబు కైవడి దుఃఖార్తిని గొఱులుచుండెను. కటకటా! శ్రీరామునిఁ జూడఁ దలంచి జీవములతో నిల్చియుండజాలెనే కాని దుష్టాత్ముండగు నా రావణుని దురాలాపములఁ జెవిదాల్ప శక్యమగునా? రామచంద్రా! ఆజానకి నెలదినములుమాత్ర మెట్టులనో యెన్నిశ్రమలకైన నోర్చియుండుదాన ననియు నీలోపునఁ దన్నాదానవాధముని బారినుండి తప్పింపుమనియు లేకున్న జీవముల నిల్పనోపననియు నుడివె. ఆ సీతాదేవి యనుభవించుచున్న యిడుమ లిట్టివియని తెలుపజాలను. అక్కటకటా! జనకునికిఁ బుత్రికయై, దశరథునకుఁ బెద్దకోడలై, అసమాన బాహువిక్రమధనుండగు శ్రీరామచంద్రు నంతటివానికి ధర్మపత్నియై పతివ్రతాతిలకమని ముల్లోకంబుల వన్నెకెక్కిన సీతామహాదేవి నేఁడా యశోకవనంబున నెండవానలకు సహించి యనుభవింపరాని దుఃఖ

మనుభవించుచున్నదిగదా! రామా! నాకు మీయాజ్ఞయే లేకుండెను గాని యీ దుర్మదాంధుని-పరనారీహింసాకరుని-దుష్టాత్ముని-యీరావణుని క్షణకాలమున దశశిరములం దునుమాడి సీతను గొనివచ్చి మీపాదపద్మముల కర్పించియుండనా? ఆపె యిడుములను దలంచిన నెంతటి ధీరునకైనను మనము చలింపకుండునను మాట కల్ల.

సుగ్రీ:—కటకటా! ఆంజనేయా! లంకాపురమందలి విశేషము లేమి?

లక్ష్మ:—(కోపముతో) ఓరీ! రావణాధమా! నీచప్రవర్తకా! నీ కవసానకాలమే సమీపించుచున్నది.

గీ. ఎందుఁజొచ్చెదవో యిఁక । నెవరిఁజేరి
శరణు వేడుదో రావణా । చావునూడ
కాక యీరీతిఁ దోచునే । కాంతఁబట్ట
చేటుకాలము వచ్చెను । ఛీ! దురాత్మ.

సుగ్రీ:—లక్ష్మణా! శాంతించుము తీనబోవుచురుచిని గోర నేల?

హను:—మహాత్ములారా! వినుఁడు. కార్యసాఫల్యమునకై యెన్ని యిడుములనైనఁ గుడువవలెనుగదా! ఏను నూరుయోజనంబుల విస్తీర్ణముఁగల పారధిని దాఁటి లంకకుఁబోతిని. తొలుత నే నా పట్టణమంతయుఁ గలయఁదిరిగి గృహములన్నియు వీక్షించితిని కాని సీతయున్నజాడ మాత్రము తెలియదాయెను. తుదకామె జీవములనే బాసియుండె నేమోయని యెంచి ఆయశుభవార్తను దెల్పుటకన్న నసువులను వీడుటయే శ్రేయోదాయకమని యోచితిని. కాని నా పూర్వపుణ్యమున—

గీ. కనఁబడె యశోకవనమునఁ । గాంతసీత
చేరి యామెకు రాముని । క్షేమవార్తఁ

తెలుపఁ దొలుతను నమ్మక । పలుకుమునికి
ముద్రిక నొసంగితిని నేను । ముదితకంత.

ఆమె దాసుని కతిభక్తిశ్రద్ధలతో నెఱిఁగికొని కంటఁగన్నుకొని పిదప రామలక్ష్మణుల కుశలంబడిగెను. తన బాధలన్నియు వెల్లడించి రాముని కెఱింగింపుమనియె. ఆమెయొక్క సెలవుగైకొని యశోకవనంబంతయు ధ్వంసముఁజేసి, పెక్కుమంది రక్కసులఁ జరిమార్చి, కడ కాయింద్రజిత్తునిచే సంధింపఁబడిన బ్రహ్మాస్త్రముచేఁ గట్టబడి, రావణునొద్దకుఁ గొంపోబడి, పెక్కునీతులఁ జెప్పితిని. ఆ దురాత్ముఁడు నాపలుకుల కాగ్రహించి నావాలమును గాల్ప నాజ్ఞనిడెను. ఆసేవకు లట్లొనర్ప, లంకాదహనమొనర్చి, తిరుగ సీతాదేవి యేమాయెనోయని సందియమంది, యామెను జేరి, క్షేమముగ నుంటినని చెప్పి బయలుదేఱి వచ్చితిని. ఇదియే నే పోయివచ్చిన వృత్తాంతము.

(అని శిరోమణిని రామునకొసంగును)

రాము:—హనుమంతా! పరోపకారపారీణా! నీయుపకార మెన్నఁటికిని మఱువఁజాలము.

హను:—స్వామీ! ఇదంతయుఁ దమ కరుణాకటాక్షవీణమే కాని వేఱొండుకాదు.

రాము:—సుగ్రీవా! ఇఁక ముందుకర్తవ్యమేమి?

సుగ్రీ:—మహాత్మా! కర్తవ్యమున కేమున్నది? రణమాచరించుటయే యిఁక మనము చేయవలసినకార్యము.

రాము:—అయిన సేనలన్నియు సిద్ధముగనుండెనా?

సుగ్రీ:—చిత్తము.

రాము:—అంగదాదివానరవీరులారా! మీరు సేనాధిపత్యముల వహింపవలెను.

అంగ:—చిత్తము.

రాము:—ముందుగ మన సేన లన్నియు లంకకుంబోవుటకు సేతువుఁ గట్టవలెను. ఈపని యచిరకాలములోనే ముగియవలయును. హనుమంతా! సీతనుగాంచి వచ్చితివి. లంకాదహనముఁ జేసితివి. నిన్నుగొనియాడుట కలవియగునా? ఈ యుద్ధరంగమున నీసహాయమే మాకు ముఖ్యము.

( తెరలో )

విభీ:—ఆర్తజనరక్షకా! భక్తపరాధీనా! శ్రీరామచంద్రా! శరణు శరణు.

(అంద ఆశ్చర్యనిమగ్నులై చూచుచుందురు)

రాము:—ఈ యార్తారవ మెవ్వరిది?

లక్ష్మ:—సోదరా! ఇదియు నొక రాక్షసుని మోసమనియే తోచుచున్నది.

సుగ్రీ:—తిరుగ మిమ్ముల మోసగింప ఖలుండగు రావణుఁడే యీ రీతిని వచ్చియుండెనేమో.

అంగ:—అక్లిష్టమైన రామా! ఆ యధమాధము నిచ్చోటనే దునుముట యుచితము.

రాము:—త్వరపడెద రేల? కొలఁది సేపటిలో నన్నియు వెల్లడి కాఁగలవు.

హను:—రక్కసులలో నొక్కఁడగుట సత్యము. ఎవ్వఁడో గుర్తింపఁజాలకున్నాను.

[ప్రవేశము—విభీషణుఁడు]

(19 వ అనుబంధము)

విభీ:—(చేతుల మోడ్చి)

గీ. మూడుమూర్తుల కెల్లను । మూలమెవఁడొ
ముజ్జగంబుల కాధార । భూతుఁడెవఁడొ

శరణువేడిన నెల్లర । సైచునెవఁడొ
అట్టి పరమాత్మునీ సింతు । నరయ నన్ను.

మహాత్మా! శ్రీరామచంద్రా! ఏ పాపాత్మునివలన నెల్లవేళల ముల్లోకంబులు తల్లడిల్లుచు ఘోషిల్లుచుండెనో, ఏ దుర్మార్గుని జననముచే సురగణంబులెల్ల భీతిలి యడఁగియుండవలసివచ్చెనో, ఏ క్రూరాత్ముఁడు నీ మహిమను గనలేక, ముల్లోకమాతయగు సీతామహాదేవిని జెఱఁబట్టి లంకకుఁ గొంపోయి లంకయందుంచెనో, యట్టి రావణాధముని సోదరుండను విభీషణుఁడనువాఁడ.

ఉ. రాముఁడనంగ నీ భువిని । రాజకులంబున నుద్భవించి, యీ
భూమిజఁ [illegible] । [illegible]
నీమము నెల్లఁ గష్టులను । [illegible] సంహరింపవే
స్వామి యటంచు సదా మదిని । భక్తినిఁ గొల్చుచున్నవాఁడనే.

గీ. దీనపోషక నినెనమ్మి । సానుభూతిఁ
జేరినాఁడను గావఁగ । జేయి మోడ్చి
మ్రొక్కుచున్నాఁడ నిక్కము । మోహనాంగ
కాచినను కావకున్నను । గలదె దిక్కు..

నా యీ దీనాలాపము లన్నియుఁ గపటములని తలపోయకుము. ఏ నట్టి పాతకుఁడనుగాను. సీతాదేవి నిట్లకారణ మిడుముల పాలుచేయుట తగదనియు, తత్క్షణమే శ్రీరామపాదపద్మముల కామె నర్పించి శరణువేడి రక్షించుమనియు నుడువ, నా ఖలుఁ డాగ్రహచిత్తుఁడై, నన్ను దన కాళ్ళను దన్ని పలువిధముల దూషింపసాగెను. అందుచే నే నటనుండ సహింపనోపక, మిమ్ముల శరణువేడి మీయొద్దనుండ నిం దరుదెంచితిని. ఆతఁడు నాకు సోదరుఁడే యైనను

మహాపాతకం బగుటచే నాతని వధించుటనుగూర్చి చింతనొందను. ఇదియుఁగాక మీకు రణమునఁ దగినంత సాహాయ్య మాచరించువాఁడు.

రాము:—సుగ్రీవా! ఇందు నీ యభిప్రాయ మేమి?

సుగ్రీ:—రాక్షసమాయ నెఱుంగ శక్యముకాదు.

రాము:—లక్ష్మణా! ఏమిసేయఁదగును?

లక్ష్మ:—ఆర్యా! ఈతని వృత్తాంతము హనుమంతు నడిగిన తెలియును.

రాము:—ఆంజనేయా! ఇందు నీ వేమినుడువుదువు?

హను:—మహాత్మా! ఈతఁడు నిక్కముగ భక్తుఁడే. ఈతఁ డనృతమాడువాఁడు కాడు. ఆనాఁడు రావణుఁడు నన్నుఁబట్టి వధింపఁ నున్న వేళ, నీతులఁగఱపినవా డీతఁడే. ఇదియుఁగాక, యీతని మూలమున మనకు సాహాయ్యముకూడ కల్గును. కావున శరణునొసం గుటయే ముఖ్యమని నా యభిప్రాయము.

రాము:—(విభీషణునిఁ జేరఁదీసి) విభీషణా! భీతినివతలుము.

గీ. రావణునిగూల్చి రణమున । రాజ్యమంత
నీకు బట్టముఁగట్టెద । నిక్కమిదియు
సందియుం బంద కింకను । సాహసమున
సాయమగు మాకు యింతట । సంగరమున.

విభీ:—మహాప్రసాదము.

రాము:—ఇంక మనము తడయనేల? పోవుదమురండు.

(అందఱు నిష్క్రమింతురు)

(తెర పడురు)

## రెండవరంగము—సముద్రతీరము

[ప్రవేశము—రాముఁడు, లక్ష్మణుఁడు, విభీషణుఁడు, సుగ్రీవుఁడు, అంగదుఁడు, హనుమంతుఁడు, జాంబవంతుఁడు నలుఁడు, నీలుఁడు, వానరసేన]

రాము:—వారధిఁగట్టుట యైనది. ఇదియే తొలుతఁ గొనసాగుట కడు దుర్లభమని తలపోసితిమి. ఇంతకును దైవానుగ్రహమున్న నెట్టి ఘనకార్యమైనను సాధింపవచ్చునుగాదె. ఆ పంక్తికంఠుని గెల్చుట కిదియు నొక శుభసూచకమే.

విభీ:—అవతారమూర్తులగు మీకసాధ్యంబగుపని యెద్దికలదు?

సుగ్రీ:—ఈ నలుఁ డిట్టివాఁడని, యీ సముద్రుఁ డెఱుంగుట వలన మనకుఁ దెలియనయ్యెను గాని లేకున్న నీ వారధి బంధించుటయే కష్టతమమై యుండును.

లక్ష్మ:—అగ్రజా! ఇఁక కర్తవ్యమేమి?

రాము:—లంకకుఁబోయి, రణమున రావణుని గూల్చుటయే కాని, నాకొక యాలోచన పొడముచున్నయది. ఏమందురా కడసారి మరల రావణునొద్దకు రాయబారి నొకని బంపు టుచితము.

సుగ్రీ:—రామా! మీ కెదురాడి వర్తించుచున్నవారము కాదు కాని, హనుమంతుఁడేగినవేళ నెన్నియో బుద్ధులు గఱపెను. విననొల్లఁడాయె. విభీషణుఁడు సోదరవాత్సల్యముఁబూని హితములఁ బల్కినందులకేకదా యాతని దూషించి, రాజ్యమందు నిలువవలదని తఱిమివేసియుంట. అట్టితఱి నింక రాయబారుల నంపుటెందులకు? వినాశకాలము దాపరించువేళ హితములఁ జెప్పువారే శాత్రవులవలెఁ గన్పట్టుదురు. రోగి కౌషధసేవయే యయిష్టమై తోఁచును.

రాము:—విభీషణా! యిందు నీ యభిప్రాయమేమి?

విభీ:—ఆమూర్ఖుఁడు చెవిదాల్చినను దాల్పకున్నను బంపుటయే ధర్మమగును. దండోపాయము కడపటి యేర్పాటుకదా!

అందఱు:—అయిన నట్లే కానిండు.

విభీ:—ఇందులకు ఈ అంగదుఁడే తగియుండును.

రాము:—అంగదా! నీవు రావణుని కడకేఁగి నాపలుకుల నిట్లు నుడివి పర్యవసాన మెఱింగిరమ్ము.

ఉ. రావణ దర్పమేల రఘు । నాయకుఁడ వచ్చితి నిన్నుఁగూల్ప నీ
కావర మింకనైన విడు । కాంతను సీతను జేర్పుమా వడిఁ
ఈవిధిఁ జేతువేని వడి । నీక్షమనుబాసియు వీడువాడ నీ
భావనలేమొ తెల్పుమిఁక । భావ్యముకాదుగ దానవేశ్వరా!

గీ. రణముఁ జేయంగ భీతిలి । రాముఁ డిట్లు
రాయబార మంపెనటంచు । రాక్షసేంద్ర
తలఁచి దర్పంబులాడకు । తగదు తగదు
రూపుమాయుట యికనైన । రూఢిఁదలుచు.

అంగదా! వేగముగఁ బోయిరమ్ము.

అంగ:—చిత్తము.

(అని నిష్క్రమించును)

రాము:—సుగ్రీవా! మనమును లంకాభిముఖులమై బయలు దేఱుదము.

సుగ్రీ:—చిత్తము.

(అందఱును నిష్క్రమింతురు)

(తెర పడును)

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# లంకాదహనము

అను

# విభీషణపట్టాభిషేకము

## షష్ఠాంకము

లంకాపురీ - రాజసౌధము

[రావణుఁడు, కుంభకర్ణుఁడు, ఇంద్రజిత్తు, ప్రహస్తుఁడు మొదలగు రాక్షసులు ప్రవేశము]

రావ:—మంత్రిశేఖరులారా! ఆ రామలక్ష్మణులు వానరులఁ గూడి మనపైకి దాడివెడల సిద్ధముగ నున్నట్లును, సేతువును గట్టి నట్లును తెలియవచ్చెను. ఇదంతయుఁ జూడ చాల నాశ్చర్యమును గొల్పుచున్నయది. వానరులేల? వారధిని బంధించుట యేల? ఆ శ్రీరాముఁడు సీత నరయుటకై బయల్వెడలి వనముల సంచరించుచు సుగ్రీవునితోఁ జేరి వాలిని వధియించియుండెనుగదా! వారంద ఱిప్పుడు లంకను జేరుచున్నారఁట. ఇప్పు డింకఁ గర్తవ్యమేమి?

ప్రహ:—రాక్షసేశ్వరా! ఇందుల కింతగ యాలోచన సేయ నేల? వానరులఁ గూడి వచ్చిన సా మానవులా మనలను జయించుట.

కుంభ:—సోదరా! లంకేశ్వరా! నామాట లాలించుము. శ్రీరాముండన మానవమాత్రుఁడని తలపోయకుము.

క. ఆమహావిష్ణువే యిట్లు । యవతరించి
భూమిభారంబుఁ దీర్పఁగఁ । బుడమినిట్లు
కాకుత్స్థవంశమున నరుఁడై । కానమునఁ
జేరి వధియింప వాలిని । చింతవలదే.

ఆమహానుభావుఁడు జగదేకవీరుఁడు. అతని గెల్చుట కీ ముల్లో కంబుల నెవ్వరికిని శక్యముకాదు. దేవతాగణములెల్ల నీకై వెఱపంది తెరువెద్దియునుగానక ఆ యాదిదేవునికడకేగి మొఱవెట్టుకొన ముందు భూలోకంబున దశరథునకుఁ బుత్రుఁడై జన్మించి, శ్రీరామ నామంబునఁ బరగుచు, రక్కసులనెల్ల దునుమాడి, భూభారముఁ దీర్చి మీయార్తిని దీర్చెదనని వాగ్దాన మొనర్చెనని వినియుండలేదా? తత్కారణమున నిప్పుడీ యిల నుద్భవించెను. నీవెంచిన ట్లాతఁడు మానవ మాత్రుఁడు కాఁడు. నీ వెవతెను జెఱఁబట్టి కొనివచ్చితివో యామె ముల్లోకమాత యగు లక్ష్మీదేవియే కాని సామాన్యపు వనిత కాదు. మనలనందఱఁ దన కోపాగ్నిచే భస్మీభూత మొనర్పగల్గియు నేకతంబు ననో రోర్చి యూరకుండెను. ఇంతయేల? ఒక్కటి తలఁచుము. ఆ రాముఁడు మానవమాత్రుఁడనియే యెంచుము. పరవనితలబట్టుట పాపహేతువుకాదా? ఆ సీతాదేవి సంతాపాగ్నియే మనల దహింపఁజాలదా? బాగుగ నాలోచించుము. చేతులు కాలినవెనుక నాకులను ముట్టిన నేమియుఁ బ్రయోజనము లేదు. శ్రీరాముఁడు కరుణా సముద్రుఁడు. శరణాగతవత్సలుఁడు, చేసినదానికై చింతనొంది యిప్పుడైన నామాతను గొనిపోయి రాముపాదముకర్పించి శరణువేడిన నాతఁడు తప్పక నీతప్పులసైరించి రక్షించును.

రావ:—(కోపముతో) ఛీ! నీనోటినుండి నేఁడట్టి యధైర్యపు వాక్కులు వినఁబడెను. నీకు భయమగునెడ యుద్ధ మాచరింపక నేమూలనో యొదిగియుండవలెఁగాని నాకు నీతులఁ గఱపుచుంటివా?

కుంభ:—సంగ్రామమునకు వెఱచి యిట్లు పలుకుచుంటినని తలంపకుము. నా ప్రాణములపై నా కొకింతయును దీపిలేదు. కాలము సమీపించినతఱి నన్నియు విరుద్ధములుగ నే తోచును. కానిమ్ము. తెలిసి నంతఁదనుక తెల్పితిని. ఆ శ్రీరామునివలన మరణమేకల్గిన నిఁకఁ గొరఁతయేమి? పుణ్యలోకములందసగును. లేకున్న నాతని నే జయింపఁ జాలుదుమేని లోకంబుల ఖ్యాతి నందవచ్చును.

(21 వ అనుబంధము)

ఇంద్ర:—జనకా! వేయునేల? రాముఁడేడ? మనల జయించు టేడ? వానికి దోడుగ వానరసైన్యమా? వారిరాకను వినినంతనే మనము భీతిలుటయా? అతఁ డవతారపురుషుఁడై, నిజముగ భగవానుఁడే యైన నింతదనుక నెచ్చోటఁ డాగియుండెను. ఇదంతయుఁ గల్ల. సమరమునకు వెనుదీయుట మిముఁబోలు శూరశిఖామణులకు లక్షణము కాదు. వెఱపేమియో నెఱుఁగని దానవకులమునకు నేఁడు కళంకమును గూర్చుట పాడికాదు. ఆ హనుమంతుఁడు తొలుత నెన్నిరీతుల వీరాలాపముల వెలిబుచ్చెను! తుదకు నాచేఁ బట్టువడలేదా? వారి ప్రగల్భములన్నియు నిట్టివే.

రావ:—సెహబాస్! మంచిమాటఁ జెప్పితివి.

[ప్రవేశము—శుకసారణులు]

శుక:—రాక్షసేంద్రా! నమస్కారము.

రావ:—ఓరీ! మీరేగినపని యేమైనది? ఏమేమి వింత లరసి వచ్చితిరి ?

శుక:—ఆర్యా! వారిసేన యపారము. వారి శక్తిసామర్థ్యములవర్ణింప నలవికాదనియే నాయభిప్రాయము. ముందుగ నావానరు

లందఱు మిమ్ముఁబట్టి వధించుమనియే రామునికిఁ బ్రోత్సాహమును గల్పించితిని, యీ మహానుభావుఁడు కడు ధర్మశాలి యగుటచే వలదని వారించెను. అందుచేఁ దిరుగ మిమ్ములఁ గన్నులఁ గాంచుట యయ్యెను. లేకున్న—మారీచ సుబాహులు వలెనే—విభీషణుఁడు వారిఁ జేరనగును. ఆ రాముఁడు వానికి లంకారాజ్యమునకు నాథునిగఁ జేసెదనని వాగ్దానము నొసఁగెనట.

రావ:—(క్రోధముతో) ఆ ఏమి? ఈ దురాత్ముఁడు శత్రు పక్షమువాఁడై, మన గుట్టు నంతయు నెల్లడించుచుండెనా? ఆ మానవాధముఁడు రాముఁ డితనికి లంకారాజ్యమును బట్టముఁ గట్టునా?

ఓరీ! విభీషణా!

గీ. శత్రువులకడఁ జేరియు । శరణుజొచ్చి
ఆశ్రయించితె నరులను । యధముడనక
లంక నేలఁగ నెంచితే । హరకమున్ప్ప
బ్రదుక నిచ్చిన నేనదా । ప్రబలుటధమ.

ఇట్లు పరుల పాదములఁబట్టి భజియించు యధమాధముఁడ వౌదువని కలనైనఁ దలంపలేదుకదా ఓరీ మూర్ఖచిత్తా! నీ మూలమున రాక్షసకులమున కంతకును యపవాద ఘటిల్లెనే నిన్ననేల? ఆ నాఁడు నిన్ను దునుమక విడిచిపుచ్చుట నాదియే నేరము. కాకున్న కులము నిష్కళంకమై యుండునుగదా.

(శుకునిఁజూచి) ఇంకను విశేషములేమి?

శుక:—రాక్షసేంద్రా! వారధిఁగట్టిరి. వానరసేన క్రమక్రమముగ లంకను జేరుచున్నది.

రావ:—సరియే మీరు జనుఁడు. మంత్రులారా! ఇఁక మన సేనల సిద్ధపఱచుఁడు. కుంభకర్ణాది వీరులారా! సమరసన్నద్ధులై యుండుఁడు.

[ప్రవేశము — సేవకుఁడు]

సేవ:— రాజా! ఎవ్వఁడో వానరుఁ డరుదెంచి దర్శనమును గోరుచున్నాఁడు.

ప్రహ:— ఈ వానరులు భీతిలేక యిట్లు లంకఁజొచ్చి రాజ సన్నిధి కరుదెంచుట యేమి?

రావ:— రానిమ్ము. భయమేమి? సేవకా! తోడ్కొనిరమ్ము. పిదప చేయవలసిన పనిని జేయవచ్చును.

[ప్రవేశము — అంగదుఁడు]

రావ:— ఈ వానరులఁట మనలను సంగరంబున నోడించువారలట.

అంగ:— రావణా! ఏను శ్రీరామచంద్రుని పనుపున నిందేగుదెంచితిని.

రావ:— ఎందులకు?

అంగ:— దశకంఠా! ఆ శ్రీరాముఁడు వానరసేనఁగూడి, సమర సన్నద్ధుఁడై బయలువెడలి, శతయోజనంబుల విస్తీర్ణముఁగల వారధిని సునాయాసముగ బంధించి, యీ లంకను జేరనుండి, కడసారి నీకుఁ గొన్ని నీతివాక్యములఁ దెలుప ముందుగ నన్నుఁ బుత్తెంచెను.

చ. అనఘుఁడు పుణ్యమూర్తి వసు । ధాధిపు రాముని భక్తినెంచకే
యనుచితమైన యుద్ధమున । కాసలఁజూపుట చెల్లునే సదా
విను మిఁకనైన సీతనిడి । వేడిన వీడఁగలండు ధర్మశా
లి నరుఁడనక యనంగ నెటు । లీలలెఱుంగవె పుణ్యపూరుషుఁడౌ

ఇంతదనుక నెట్టిప్రల్లదంబులఁ బల్కినను, యిప్పుడైన, సీతాదేవి నాతని కర్పించి శరణువేడిన నిన్ను విడిచిపుచ్చును, లేకున్న జరుగవలసినదంతయు నీకే యెఱుక ఎందులకు నిష్కారణముగ ద్రో

హామాచరింతువు. రాఘవుఁడెంత నెట్టిబలశాలియో యెఱింగియు నిట్లు మూఢచిత్తుఁడవైన నెవ్వరుబోధింపఁజాలుదురు. తెలియనివానికిఁ దెలుపఁదగునుగాని, తెలిసియుఁ దలఁదాల్చెద ననువానికిఁ జెప్ప సమర్థుఁడెవ్వఁడు? నీవు నిజముగ నిపుత్రమిత్రకళత్రాదులతో సేమముగఁ గనుపనెంచినపక్షమున మూఢత్వమును వీడి, రామునియొద్దకేగి, సీత నర్పించి శరణువేడుము. ఈ లంకారాజ్యము విభీషణునకు దాన మొసంగినరీతిని నీకా యయోధ్యారాజ్యము నిచ్చును.

రావ:—(క్రోధముతో) సేవకులారా! తత్క్షణమే వీనినిబట్టి వధించుడు.

ఇంద్ర:—రాక్షసేంద్రుని చెంత నింత నిర్భయమా? ఇంత కౌరవమా?

(రాక్షసులు అంగదునిఁబట్ట జుట్టును మూగుదురు)

అంగ:—ఓరీ! నీచులారా! మీరా నన్ను వధించుట. ఛండు. అ వల నొక్కనుగాఁ వధించి మరియును బోవువాఁడ. (తనలో) ఇ వాకు వీరితోఁ బోరాటమునకుఁ గడంగుటతగదు. ఒకవేళ నెట్టిప్ర మాదమైనను సంభవింపవచ్చును.

(అని ఒకరిద్దఱిని గొట్టి పాఱిపోవును)

(తెర పడును)

---

రెండవరంగము—అంతఃపురము

[ప్రవేశము—రావణుఁడు, మండోదరి]

రావ:—తన్వీ! ఎందులకుఁ గబురునంపితివి?

మండో:—నాథా! శ్రీరామునితో సంధియా? లేక సమరమా?

రావ:—ఒక మానవాధమునితో నాకు సంధియేమి? సమ రమే నిశ్చయము.

(21 వ అనుబంధము)

మండో:—ప్రాణేశ్వరా? నా పల్కుల నాగ్రహింపకుండు. రాముఁడన నెవ్వరని యెంచితిరి? ఆ మహానుభావునిం బూను సమరమా? సకలలోకవంద్యుఁడు అసమానబాహుపరాక్రముఁడు. శూరశిఖామణి. అవతారపురుషుఁడు. దుష్టులను రూపుమాపి, భూభారమును దీర్పనెంచి, యీయవని నవతరించిన నా శ్రీమహావిష్ణువు. ఆతని కెగ్గుదలంచి, బ్రతుకఁగలవాఁ డెవ్వఁడు? నిక్క మరయుఁడు. మీకుఁ దెలియనివిషయము లెవ్వియును లేవు. తన కోపమే తనకు శత్రువగును. క్రోధమువలనఁ బ్రతికార్యములు చెడును. శాంతమే భూషణము. అదియే సర్వకాలములయందును, సర్వావస్థలయందును మిత్రునివలె నుపకార మాచరించును. మీరీ సీతాదేవినిఁ బట్టదెంచి, జనకుని గృహమునకుంబోయి హరువిల్లు పిఱువ నెత్తించిరి. సాధ్యమయ్యెనా? మీ కసాధ్యంబగు నా వింటిని శ్రీరాముఁడవలీల విఱుచెను. వాలి మీ కన్న బలవంతుఁడుకదా అట్టి వాలిని నిమిషమాత్రమున నొక్క బాణముచేఁ జెండాడెను. ఇంతియు నిక్కముగునా? కాదా? అట్టి త్రైలోక్యవీరుని జయించుటకు మీకు శక్యమగునా?

రావ:—దేవీ! జయాపజయముల నిర్ణయింపవశమగునా?

మండో:—నాథా! శ్రీరాముని పరాక్రమసామర్థ్యము లెఱుంచుఁడు. మహాపతివ్రతాశిరోమణియగు సీతయొక్క యాగ్రహవిగ్రహములు రాక్షసకులము నిర్మూల మొనర్పఁజాలదా? పరనారీమణులఁ బట్టుట మహాపాతకముకదా! ప్రాణేశ్వరా! ఆ సీతాదేవి నిద్రాహారముల విసర్జించి, శోకాకులచిత్తయై తపియించుచున్నయది. ఆసీత నీ లంకకుఁ జేర్చినదాదిగ లంక కళావిహీనమై కష్టపడుచున్నయది. మీ సోదరుఁడగు విభీషణుఁడు మిమ్మొత్రఁబాసి శత్రువర్గమునఁ జేరెను.

సీ. దనుజేంద్ర వినుమయ్య । దానవాంతకుఁడగు
శ్రీరాముఁ డరయగ । సీతయేల?
మానవుఁడే యైన । మడియుంత వాలిని
సాధ్యమే కనుము రాజ్య । సానుభూతి
అవతారపురుషుఁడు । ఆరాముఁ డెన్నఁగ
శ్రీమహావిష్ణువే । చేరెనిటుల
హరువిల్లువిఱువగ । నాతని కేతరు-
నారులకు శక్యమే । పరమపురుషు

గీ. నెంచఁదగునొక్కఁ నరుఁడని । యనకు లేను
డమ్ముతోఁ జుదిఁదలఁచిన । నణగు నసుము
శరణువేఁడెదఁ గాదను । సీతనొసఁగి
ప్రార్థనల్ సల్పుటొప్పగు । బ్రదుకఁ దెరువు.

మీరు కోరిన వనితలే కఱవగునా రా? మిమ్ముల సతతము దూషించు సీతను జేఁపట్టి మీరనుభవించు సౌఖ్యము లేమి? తొల్లి యొందఱెందఱు పరనారులఁ బట్టనెంచి యిడుమ లందియుండిరో తెలి యరా? ఇంద్రుఁడంతటివాఁడు, పతివ్రతయగు యహల్యను మోస గించి యెట్టికష్టము లందెనో వినియుండలేదా? పాషాణమైయున్న అహల్యకు శాపవిముక్తిఁ గావించిన మహానుభావుఁడు శ్రీరాముఁడు.

రావ:—సఖీ! కడసారిగ నాపలుకులనువినుము. ఆశ్రీరాముం డవతారపురుషుఁడనియు, సీత మహాలక్ష్మియనియు నీవు నాకు భీతిఁ గొలుపనేల? ఒకవేళ నాతఁ డట్టివాఁడేయైన నిఁక భయమేల? ఆతని చేతిలో మరణమే ప్రాప్తించెనా? పుణ్యలోకము లందఁదగును. ఆత నినే రణమున గెలువఁజాలితినా? ముల్లోకంబులఁ గీర్తి వడయఁ గూడును. కాన

గీ. సమరమే శత్త్యమాను నింక । సామమేల
రాముఁడన్నను భీతిల । రామ సీత
విషవఁజాలను పడఁతిగో । విడువుమనుచు
బలుకి పలదింకి మరలుము । భయమ్మిదేల.

(అని రావణుఁడు నిష్క్రమించును)

మండో:—అయ్యో! నా నాథుఁ డెన్నివిధముల హితములఁ బల్కినను బెడ చెవిని దాల్చె నే కాని విననొల్లకుండెను. హా! దైవమా! ఏమిసేయుదాన? ఎల్లెడ ననిక శ్రీరామునివలన నీతనికిముప్పువాటిల్లక మానదు. ఏమైన నాపరమేశ్వరుని దే భారము. దైవ మనుకూలించిన వేళ నన్నియు శుభదాయకములే యగును. లేకున్నఁ జేతికర్రయే పామై కఱచును. రాముఁడు భగవానుఁడని తెలియును. ఆతనివలన దనకు మరణము తప్పదనియుఁ దెలియును. అయిన నేమి ప్రయోజనము? మృత్యువు శాఁబట్టి యున్నపుడు బోధలు చెవికెక్కునా? హా! నాథా! నాథా! ఇఁక నినుజూచు భాగ్య మున్నదో లేకున్నదో కదా.

(తెర పడును)

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# లంకాదహనము

అను

# విభీషణపట్టాభిషేకము

## సప్తమాంకము

### లంకాపురి రాజసౌధము

[ప్రవేశము — రావణుడు, ఇంద్రజిత్తు]

రావ:— కుమారా! తుదకు మనకపజయమే పొసగునట్లు తోచుచున్నది.

ఇంద్ర:— ధీరచిత్తులగు మీరలే నేఁడిట్లు ధైర్యమును బాసిరేల?

రావ:— రానురాను మనసేనలన్నియు క్షీణించుచున్నవనియు, వానరసేన బలసమృద్ధిం బడయుచున్నదనియు నిప్పుడే తెలియనయ్యెను. సేనాధిపతులెల్లఁ జాలమట్టుకందఱు పరలోకమునకుఁ జనియుండిరఁట. ఇఁకఁ గర్తవ్యమేమియో తోచకున్నయది.

ఇంద్ర:— ఓహో! ఇదేటివింత? రణమున నుభయపక్షుల వారును మరణించుచుందురు. ఒక్కఁడును జావకుండగనే జయము చేకూరునా?

రావ:— కుంభకర్ణుఁడింకను నిద్రను జిక్కియే యున్నవాఁడు కాఁబోలును.

ఇంద్ర:— (క్రోధముతో) జనకా! నా ప్రతిన వినుఁడు. ఏనిప్పుడే యుద్ధభూమికిఁబోయి నా బలపరాక్రమములు వెల్లడింపఁజేసి యా రామలక్ష్మణుల ముందుగ నాయమపురికి బంపివచ్చెదను.

గీ. రామలక్ష్మణులనుబట్టి । రణమునందు
గూలగాఁజేసి యరుదెంతు । కూడదిట్లు
చింతనొందుట యేటికి । శీఘ్రగతిని
శత్రుఘపుల రూపుమాపగ । జయమురాదో.

ఏ నిప్పుడే పోయివచ్చెదను. సెలవొసంగుఁడు.

రావ:—మంచిది. పోయిరమ్ము. ఆ రామలక్ష్మణు లసమానధీరులు. రణస్థలిని జాగ్రత్తగ సంచరింపుము. పోయిరమ్ము.

(ఇంద్రజిత్తు నిష్క్రమించును)

రావ:—నేఁ డేలకో యశుభసూచకము లెక్కుడుగఁ గన్పట్టుచున్నయవి. ఇఁక నేమి గలుగునో? సేవకా!

[సేవకుఁడు ప్రవేశించును]

సేవ:—రాక్షసకులసార్వభౌమా! ఏమియాజ్ఞ?

రావ:—నీవేఁగి తగిన సన్నాహములు గూర్చుకొని కుంభకర్ణునిఁ దోడ్కొని రావలయును. శీఘ్రముగ బొమ్ము.

సేవ:—మహాప్రసాదము. (అని కొంతదూర మేగి)

(22 వ అనుబంధము)

(తనలో) అయ్యో! రామరాను లంకాపురి యెట్లు కళావిహీనముగ నున్నదో యట్లే మా రాజేంద్రుని మోమును వెలవెలబాఱుచున్నయది. క్రూరుల కెన్నటికిని జయము కలుగనేరదనుట నిశ్చయము. ఇప్పు డేను పోయి కుంభకర్ణుని మేల్కొలుపవలెనఁట. ఆయన మేల్కొనుటయు, యుద్ధ మాచరించుటయు రెండునుగల్లయే. అయిన నాపని నేను నెఱవేర్చుకొనకతప్పునా?

(అని నిష్క్రమించును)

[ తెరలో ]

రాక్షసేంద్రా! మనకే జయము ప్రాప్తమైనది. రామలక్ష్మణులు రణరంగమునఁ గూలినారు.

రావ:—(ఆశ్చర్య సంతసములతో) ఏమేమీ? రామలక్ష్మణులు మడిసిరా? ఆశ్చర్య మాశ్చర్యము!! (అని లోని కేగును)

(తెర పడును)

రెండవరంగము—రణభూమి

[రామలక్ష్మణులు నాగపాశబద్ధులై పడియుండఁ జుట్టును సుగ్రీవాది వానరులు, విభీషణుఁడు, దుఃఖించు చుందురు]

సుగ్రీ:—హా రామచంద్రా!

గీ. రావణాది మహోగ్రుల | రణమునందుఁ
గూల్చి జానకి శీఘ్రమే | కోర్కె దీఱఁ
గూడెదనుచుఁ బల్కితే | కూలితిట్లు
తెరువు కలదొకో మాకింక | ధీరచరిత.

అయ్యో! రాఘవా! రఘుకులతిలకా! కేవల పరమాత్మస్వరూపుఁడవనియు, అవతారమూర్తివనియుఁ, బదునాల్గుభువనముల వెదకిచూచినను నీ కెదురై వర్తించువారలు లేరనియు నమ్మియుంటిమే కాని, యిట్లు దారుణమృత్యుప్రవాతఁ బడుదువని కలనైనఁ దలంపలేదు కదా. భక్తజనపోషకా! రావణాది దుష్టరక్కసుల నెల్లఁ దూపుమాపి, లంకారాజ్యమునకు విభీషణు నధిపునిగాఁజేసి, భూజాతను జేపట్టి సంతససౌఖ్యంబుల నయోధ్యకు సోదరసమేతంబుగఁ జేరువాఁడనని పల్కియుంటివే. ఆ పల్కులన్నియు నీకు నేఁ డెట్లు మఱపునకు వచ్చెను. హా! సీతామనోహరా! నీకీ రణమున నెంతయో యుప

కార మాచరించి నీచే మెప్పువడయఁజాలుదునని సంతసించుచుంటినే ఆ సంతసమంతయు నంతమొందుకాలము ప్రాప్తించెనా? తండ్రీ! జగన్నాయకా! నీ మృదుమధురాలాపములు నేఁ డేమొడదాగియుండెను. ఈ వార్తయే మా భరతాదుల చెవిసోకిన నిఁక వారును జీవములఁ బాయుదురుగదా! క్షణక్షణమున నేయాలోచనలు కావలసినను, సుగ్రీవా! ఇఁకను నీ యభీష్టమేమని పలుమరు యడుగుచుండు వాఁడెవ్వడే? అయ్యో! ఇఁక నాకా భాగ్యము లేకపోయెనా? మీరు సోదరులిరువురు రణస్థలిని బడియుండ, మాకిఁక కిష్కింధయేల? రాజ్యసుఖము లేల? మేమును మీ వెనువెంటనే యరుదెంతుము. సుమిత్రాతనయా! సోదరుని విడనాడనోపక, సకలసౌఖ్యంబుల విడనాడి, వనములఁ జేరవచ్చినందులకుఁ దుదకు నీయగ్రజుని నిప్పుడుకూడ వీడఁజాలక వెంటనంటితివా? ఎట్టి ధన్యాత్ముఁడవోకదా! మే మెంత కృతఘ్నులమై చరింపవలసిన కాలము ఘటించెను. ఓ పంచభూతములారా! రామలక్ష్మణు లీ రీతినిబడియుండఁ జూచుచు నూరకుండ మీకు న్యాయమగునా? ఓ దేవేంద్రాది సురలారా! మీకైకాదె రాము డీరీతి నవతారపురుషుండై జన్మించినది? ఇప్పు డాతడు పడియున్నవేళఁ గాపాడుటకు రాఁజాలరా? అయ్యో! వీరిని గాచువారొక్కరును గాన్పింపకుండిరే. హా! హాతవిధీ!—

(23 వ అనుబంధము)

హను:—(దుఃఖించుచు)

అయ్యో! మే మెంత పాపాత్ములమైతిమి. ఇనకులభూషణా! శ్రీరామచంద్రా! మాపై నింత క్రోధమూని పలుకకుండుటకు మే మొనర్చిన తప్పిదమేమి? రామా! రామా! ఆ యశోకవనమున నెండ వానలకోర్చి దుఃఖాకులస్వాంతయగు సీతామహాదేవి, యింక నీవెన్నఁడు యేతెంచి దుష్టరక్కసులం బరిమార్చి యాపెను జేపట్టుదువని తల

పోయుచు జీవములతో నిల్చియుండెను. అక్కటా! ఈ వార్త యాపె చెవి సోకిన—కటకటా! దుర్భరము. దుర్భరము. తలఁచినంతనే గుండెలు ఝల్లుమనుచున్నవి. దుఃఖ మతిశయించుచున్నది. రామలక్ష్మణులారా! మీ కే నిక్కముగ సంభవించిన భూమ్యాకాశంబు లింకను తలక్రిందుకాక యెట్లునిల్చియుండెను? రామా! నిక్కమా విగతజీవుడ—అయ్యో! అయ్యో! నేను తిరుగ నశోకవనమున కెట్లు పోఁగలను? సీతాదేవి మో మెట్లు తిలకింపువాఁడ? ఇంతవరకు జరిగిన విషయములన్నియు, కల్లలేనా? ఇంతయుఁ గలయేనా? రామలక్ష్మణులకే వినాశకాలమా?

ఉ. ఏగతిఁబోవువాఁడ నటు । లేమని తెల్పుదు సీతగాంచినన్
రాఁగతమేమి? తెల్పు మన । రామునకీగతి గల్గెనంచు నే
నేఁగియుఁజెప్ప నా సుదతి । యెట్టులసిల్వఁగనోర్చునింకఁ దా
వేగమె చేరఁబోవుఁ బతి । వెట్టితనంబగు నేలపోవుటల్.

అంతకన్న నిచ్చోటనే జీవములఁబాయు టెంతయు శ్రేయోదాయకము.

విభీ:—కరుణాసముద్రా! రామచంద్రా!

గీ. దుష్టరావణుఁ బరిమార్చి । తొలఁగఁజేసి
లంక నేలంగఁజేసెదఁ । బంకమాచు
పల్కియుండియు మఱచితే । భవ్యచరిత
పాడియగునె యీరీతిని । బాయ మమ్ము.

రఘువంశోద్ధారకా! రామా! నన్నేలికన్పించి యరిగితివి? నాకింకేమిదిక్కు. ఆ రావణుచేతిలో మరణమే నాకుఁ బ్రాప్తమా? అయ్యో! భక్తపరాధీనా! మిమ్ముల నెడబాసి యేరీతి మనియుండఁ జోపుదుము? తండ్రీ! జగన్నాయకా! శరణన్నమాత్రమున శత్రువు

నికి సోదరుఁడని యైనఁ దలఁపక, సుగ్రీవాదులు రక్కసుని నన్నుఁ జేరఁ దీయఁదగదని యెన్ని విధములు నుడివినను ఆ దశరణ్యామె కర్తవ్యమని యెంచి చేరఁదీసితివే. మహాత్మా! ఆ కరుణాసంపత్తియుఁ జెడి యిప్పుడిట్లు పలుకకుండుట న్యాయమగునా? ఆ సీతాదేవికిఁక నేదియాధారము? ఆ భరతాదిప్రముఖుల కేదిదిక్కు.

[గరుత్మంతుఁడు ప్రవేశించును]

గరు:—ఈ రామలక్ష్మణులు నాగపాశబద్ధులై మూర్ఛను మునింగియున్నవారలు. జరుగవలసిన విషయములన్నియు మిగిలియే యున్నవి. కాలయాపనము సమయము కాదు. వీరిని విముక్తులుగఁ జేసెదఁగాక.

(అని రామలక్ష్మణుల విముక్తులుగ నొనర్ప యిరువురు లేచి నిలుతురు)

అంద:—(సంతసముతో) మహాత్ములారా! రామలక్ష్మణులారా! మాభాగ్యమేమని వర్ణించుకొనఁజాలుదుము.

రాము:—అదిగో! మనల నిట్లు నాగపాశబద్ధులఁ జేసిన మోసకాఁడు. ఇంద్రజిత్తుఁడతఁడుగో! ఆ మేఘములమాటున డాగియున్నాఁడు.

లక్ష్మ:—(ఇంద్రజిత్తునిగాంచి) ఓరీ మూర్ఖా! ఎందుఁజనెదవు?

గీ. మూర్ఛను మునింగినంతనే । మూఢచిత్త
పోరునందున జయమంచు । పొల్చినగునె
ఎందుఁజొచ్చెదవో యిఁక । యోచించినన్ను
రూపుమాపక వీడుదే । రూఢినమ్ము.

(అని బాణముల సంధించును)

ఇంద్ర:—లక్ష్మణా! ప్రగల్భములేటికి? శక్తియున్న నిల్చి పోరుము. ఇదివర కనృతమే యగునుగాని యిప్పుడు మీజీవములఁ గొనుట నిశ్చయము.

(అని సంసిద్ధుఁడగును)

విభీ:—(లక్ష్మణుని చెవిలో నేదియో చెప్పును)

లక్ష్మ:—అట్లనే. (అని బాణమును విడుచును)

(ఇంద్రజిత్తు విగతజీవుండై నేలఁగూలును)

(తెర పడును)

---

## మూఁడవరంగము—అశోకవనము

(24 వ అనుబంధము)

సీత:—(దుఃఖముతో) హా! నాథా! ఇంకను నెంతకాలమిట్లు దుఃఖానలంబున మ్రగ్గుచు నుండియుందును? ఎన్నఁటికి నీ ముఖావలోకనమునఁ జింతాసముద్రమును దాఁటనోపుదునో కదా? అయ్యో! ఇంకను నా కర్మానుభవమున కంతము కలుగనేరదా? రాఘవా! రావణుని మనుముటకింకను నెన్నినాళ్ళుపట్టును? ప్రాణేశ్వరా! గడువు సమీపించుచున్నయది. ఈలోపున నన్ని చెఱనుండి విడిపింపఁజాలవా? అయ్యో! సంగ్రామవిశేషము లేమియుఁ దెలియకుండెనుగా! ఈ దుష్టాత్ముఁడు సాధారణముగ నంతమొందునా? కటకటా! ఎన్నినాళ్లీశోకమనుభవింపఁజాలుదును?

రావ:—(కోపోద్రేకమున) ఏల నన్ను వారించెదరు. ఏవనితచే నాసేనలన్నియు నంతమొందుచుండెనో, ఏవనితచే శూరశిఖామణు లెల్లఁ గూలిరో, ఏయధమురాలివలన నాప్రియసుతుఁ డింద్రజిత్తుకూడ మృతినందెనో యట్టి యా దుర్మార్గురాలిని—సీతను వధియించి రక్తపాన మొనర్చెదనుగాక.

సీత:—(భీతహృదయయై) అయ్యో! ఈ దశకంఠుఁడు ఉగ్రుఁడై యరుదెంచుచున్నవాఁడు. నేటితో నాకింక యంతమే కాఁబోలును. హా! నాథా! శ్రీరామచంద్రా!

గీ. కష్టముల కెల్లనోర్చితి । కడకు మృత్యు
వేఁటని జేరగనుండె । నే దయార్ద్ర
హృదయు నాప్రియు మోక్షమైన । నొందఁదగునె
గడుష సత్యంబు యీమాన్షే । గాపకున్న.

[ఖడ్గమునుబూని రావణాసురుఁడు, వానిని వారించుచు సుపార్శ్వుఁడును ప్రవేశింతురు]

సు:—దానవేశ్వరా! వనితను నిష్కారణముగ వధింపఁజనునే?

రావ:—ఈ దుష్టాత్మురాలివలననేకదా మనలంకారాజ్యమున కీట్టిపాట్లు జనించెను. ఇంకను నిపేక్షించఁగనిక రమా—శాంతమా.

సుపా:—ఆర్యా! అట్లుకాదు. నాపల్కులనాలించుఁడు. రణరంగమందు యుద్ధమున రామలక్ష్మణులను వానరసైన్యంబులతోఁ గూల్చి ప్రసిద్ధినొందుట మిముఁబోలు ఘనచరితులకు న్యాయమగును గాని ఏపాపమెఱుంగని యువిదను నిష్కారణముగ వధించిన నేమి ప్రయోజనము? ఈమాత్రము శంకింపవలదా!

రావ:—అగునగును. రమ్ము రణరంగమున కేఁగుదము.

[తెరలో]

ఓ దైత్యకులాగ్రణీ! రమ్ము. రక్షింపుము. రక్షింపుము. మేమీ నిశిత బాణజ్వాలల కోర్వఁజాలకున్నాము.

రావ:—సుపార్శ్వా! ఇది యేమి? మన రక్కసులలోనే కోలాహలముజనించినది. తడయుటకు సమయముకాదు. రమ్ము. రమ్ము.

(అని ఇరువురును నిష్క్రమింతురు)

## నాల్గవరంగము—యుద్ధభూమి

[రామలక్ష్మణులు రావణకుంభకర్ణులతో పోరాడుచుందురు]

రాము:—ఓ దైత్యకులాధములారా! నేఁడైన మీ రిరువురిని చేతిలోఁ మడియుట నిక్కము. కాచుకొనుఁడు.

(అని యొకబాణమును విడుచును)

లక్ష్మ:—ఓహో! రావణకుంభకర్ణులారా! రండు. రండు. కాలుఁడు మీకై యెదురు చూచుచున్నవాఁడు. ఓరీ! రావణా! నీదర్శనమునకై వేచియున్నాను. ఇంకెంతకాలము జీవించెదవు? మా ప్రతాపము లివే కనుఁగొనుము. (అని బాణమును వదలును)

[ప్రవేశము—విభీషణుఁడు, సుగ్రీవుఁడు, హనుమంతాది వానరులు]

రాము:—ఓ వానరవీరులారా! కడసారి యని రావణకుంభకర్ణులు నేఁడు రణరంగమునకు వచ్చియున్నారు. కాలయాపనమేల? ముందుగ మీరందఱీ కుంభకర్ణునితోఁ బోరుసల్పుఁడు.

(అందఱును సన్నద్ధులగుదురు)

కుంభ:—(కోపముతో) ఓరీ! నీచులారా! మీరా నన్ను గెల్చుట? మీరందఱు నా కెరయగుటకే యాధాత మిమ్ముల సృష్టించెను గాఁబోలును. మీరు పోయినను పోనిచ్చువాఁడను గాను.

రాము:—ఇఁక శాంతమూనుట తగదు. వానరసేనలన్నియుఁ జెల్లాచెదరగుచున్నవి. ఓరీ! కుంభకర్ణా! ఇదిగో! ఈ బాణముచే మడిసెదవు గాక. (అని బాణమును విడుచును)

(కుంభకర్ణుఁడు హా! హా! ధ్వనులతోఁ గ్రిందపడి ప్రాణములు విడుచును)

వానరులు:—రామచంద్రా! ఇఁక రావణసంహారము మాత్రము మిగిలియున్నది.

రావ:—(రామునిఁజూచి) ఓరీ! మానవాధమా!

గీ. కూల్చితిని యింద్రజిత్తుని । కుంభకర్ణు
నంచు సంతసమేటికి? । కాచికొమ్ము
నాదు బాణాగ్నికేలఁ జేతు । నాదు బలము
నరసెదవుగాక నిలువుము । ఆశవదలి.

రాము:—ఓహో! అంత ప్రతాపశాలివి కనుకనే—

గీ. తాపులక్ష్మణు లెడఁబాయు । రామసీతఁ
బట్టితెచ్చితి వీఁకఁజాలు । పల్కులేల?
శక్తియేయున్నఁ జూపుము । సమరమందు
ప్రల్లదంబులఁ బల్కుట । పాడియగునె.

చోరవిభంగి, మారీచుని మాయామృగమై మమ్ముల మోసగింప ముందుగఁ బుత్తెంచి సీతను గైకొనివచ్చుటనుకొంటివి కాఁబోలును. ఇఁకనైన మా శక్తిసామర్థ్యంబులరసి బుద్ధితెచ్చుకొనుము.

గీ. కుంభకర్ణాదులందరు । కూలిరిఁకను
మిగిలియున్నావు నీవిఁక । మేలమాడ
దగునె జానకి నర్పించి । తాల్మికల్గి
శరణువేఁడుము పోలెద । సమరమందు.

రావ:—కుంభకర్ణాదులను జయించినంతనే నీ పరాక్రమ మతిశయించెనా? ఏను నీకు సీత నర్పించి శరణువేడిన కాపాడెదవా? ఆహా! ఏమి నీ పౌరుషము! అందువలననే,

గీ. సకలభోగంబు లెడఁబాసి । చనియు నటవిఁ
గందమూలాదు లాశించి । గడగవలసె
నీదు మహిమంబు తెలియదో । నీతిలేదొ
దర్పములనాడఁ జెల్లునే । ధైర్యమగునె?

నీకు నిక్కముగ నాతో సమర మొనర్ప భీతియే జనించినయెడ మరలిపొమ్ము. నా కీవు బుద్ధిగఱప నగత్యము లేదు.

రాము:—అయిన నీకీ గాలయాపన మేల? చెప్పవలసిన దేదియో చెప్పితిని. కాచికొమ్ము.

లక్ష్మ:—అగ్రజా! ఈతని నేనే దునుమాడెద నొకింత తాళుడు. ఓరీ! రావణా! రామలక్ష్మణుల నెట్టివారో నీకు జవి చూపించెద గాచికొమ్ము. రాక్షసేంద్రుడనని యును బలపరాక్రమశాలి ననియు విఱ్ఱవీగుచుంటివి. (అని బాణమును వదలును)

రావ:—ఓహో! ఈతని ప్రలాపము లభివృద్ధిగాంచుచున్నయవి. కానిమ్ము. ఈ మాయాశక్తిని బ్రయోగించి యీ లక్ష్మణుని మూర్ఛిల్లజేసెదగాక.

(అని శక్తిని బ్రయోగించును)

లక్ష్మ:—హా! హా! అగ్రజా! (అని మూర్ఛమునుంగును)

రాము:—(లక్ష్మణునిమీద బడి) అయ్యో! తమ్ముడా! లక్ష్మణా! ఇం కేమి సేతును? తమ్ముడా! పలుకవేమి? హా! ఇక నా కెవ్వరుదిక్కు? సుగుణాలంకారభూషణా! గోరుచుట్టుమీద రోకటి పోటన్నట్లు నీవుగూడ నన్ను విడనాడుచుంటివా? హా! దైవమా! ఇదేమి యన్యాయము. సోదరా! సోదరా! నీ ప్రియోక్తుల కంతమేనా? లక్ష్మణా! నాయీ తాపాగ్ని నెట్లు సహింపనోపుదును? అయ్యో! నాతోడ వనములకు జరింప నీకు నాయందట్టి వాత్సల్యతయే జనించె? వలదని యెంతగ బ్రతిమాలినను వినవైతివి కదా! సౌమిత్రీ! లోకమంతయు నంధకారమయమయ్యెను. ఈ పదునాల్గువత్సరములు నిద్రాహారములనే త్యజించి సోదరునకు సేవ సల్పినందులకు ఫలిత మీ రీతిని సమకూరెనా? తండ్రీ! కటకటా! నీవులేక నేనా యయోధ్య

కేకీతిఁ బోవువాఁడ? సుమిత్రాదేవి యెదురుగవచ్చి సోదరుఁ డేడన—
అక్కటా! ఏమని తెల్పుదును? అయ్యో! సీతకై యీ రాత్రిని సౌఖ్యము
మరణించిన, సోదరుఁడు జీవించియుండుననుగదా. హా! తమ్ముఁడా!
నీ మోమెంతలో కళావిహీనంబయ్యెను. నన్నీరీతివదలి, పురమున
కేఁగి యీ యూర్మిళ మోమెట్లు తిలకింతువాఁడ. ఓ జీవములారా?
అయ్యో! ఇంకను బోవరే, యీ పాపాత్ముని మేను నంటియుంటిరా!
భూమ్యాకాశంబులారా! నన్ను మీలోఁ గలపుకొనుఁడు. సుగ్రీవా!
ఇఁక నీవు సేనలతో బురమునకుఁ బోవలయును. ఇఁక నాకీ యుద్ధమేల?
సీతయేల? నా సోదరుఁడు లేక నాకీ యిహలోకసౌఖ్యము లెందులకు?
హనుమంతా! నీ వాచరించఁదగిన యుపకారములన్నియు నొనర్చితివి?
ఇఁక జేయవలసినపను లెవ్వియును లేవు. అన్నియుఁ బూర్తియయ్యెను.
నా సోదరుఁడే నన్నెడఁబాసిపోయెను. అంగదాది ప్రముఖులారా!
మిమ్ముల నింతదనుకఁ గష్టపెట్టినందులకు క్షమించుఁడు. ఈ రాముఁ
డిక హతభాగ్యుఁడయ్యెను. తమ్ముని జేతులార వీడిన యధముఁడు
నను బోలు దురదృష్టులింకొక్కరుండరు. మీరు కిష్కింధకుఁ బొండు
విభీషణా! ఈ రాముఁడు మునుపటి రాముఁడు కాఁడు. నీకు లంకా
రాజ్యమొసంగెదనన్న రాముఁడు గతించెను.

సుగ్రీ:—రామా! ఇనకులోత్తమా! మీయట్టి ధీరచరితులే
యిట్లధైర్యచిత్తులై దుఃఖాంబుధిని మునింగిన నింకేమి తెరువు?

విభీ:—రామచంద్రా! మిమ్ముల నోదార్చుటకు మేము సమ
ర్థులమా! ఇట్లు దుఃఖాకులచిత్తులై ధైర్యలక్ష్మిని విడనాడుట పాడియా!
ఈతఁడు మూర్ఛను మునింగియున్నవాఁడు దానిఁ బాపయత్నించుఁడు.

రాము:—అయ్యో! ఇంకా యత్నమా? నా తమ్ముఁడు
తిరుగ నాతోఁ బల్కునా? ఏ నంతటి యదృష్టవంతుఁడనా?

జాంబ:—సుషేణా! కర్తవ్య మూహింపుము.

సుషే:—సూర్యోదయాత్పూర్వమే ద్రోణాద్రికేగి, యందున్న విశల్యకరణిని గొనివచ్చిన నీతఁడు పునర్జీవితుఁడగును. సందియములేదు.

జాంబ:—హనుమంతా! నీవే యందులకు సమర్థుఁడవు. రామ భక్తాగ్రేసరా! తడవేల బయలుదేఱుము. అచ్చోట కేఁగునప్పుడీ రక్కసులు మాయాకృతులఁదాల్చి మోసపుచ్చఁజూతురు. వానిని లెక్కసేయక సూర్యోదయంబునకుఁ బూర్వమే రావలయునుసుమా!

హను:—రామచంద్రా! సెలవొసంగుము. పోయివచ్చెదను.

రాము:—హనుమంతా! మమ్ముల సుఖముగ నయోధ్యకుఁ జేర్చుట నీయదే భారము. శుభమగుఁగాక. పోయి త్వరితముగరమ్ము.

(హనుమంతుఁడు నిష్క్రమించును)

లక్ష్మణా! మూర్ఛాసముద్రమున మునింగితివా? ఒకసారియైన నా పల్కు జవదాఁటి యెఱుంగవుకదా! ఈ వనవాసము నిన్నుఁ బాయుటకే దాపరించెనా? నా మూలమున జనకుఁడు మరణించెను. సోదరుఁ డెడబాసెను. ఇఁక నేనుమాత్ర మీ పాడుజీవముతో నిల్చుటేల?

విభీ:—శ్రీరామచంద్రా! హనుమంతుఁడు వేగమే రాఁగలఁడు. లక్ష్మణుఁడును సుఖసుప్తుఁడగును. ఈ రీతి నెంతకాలము విలపించిన నేమి ఫలము? ఇట్లు సకలమెఱింగిన నీవే నిన్నుమఱచి దుఃఖాకుల స్వాంతుఁడవైన నెవ్వరోదార్పఁజాలుదురు?

రాము:—సుమిత్రాతనయా!

సీ. తల్లులందఱుఁ జేరి । తమ్ముఁడేడని పల్కఁ
బ్రత్యుత్తరంబేమి । బల్కువాఁడ?
సోదరు లేతెంచి । సుగుణాత్ము లక్ష్మణుఁ
జూపుమన నెవరిఁ । జూపువాఁడ?

పతి యేతెంచెనటంచు । భావించు నూర్మిళఁ
దార్మి నేరీతి నో । దార్చువాఁడ?
గురువులు నన్నుఁ గాంచి । కూర్మి సోదరుఁడేడి
చెపుమన్న నేమని । చెప్పువాఁడ?

గీ. పురజనుల నెట్లు యోదార్తు । భువిని నింక
బ్రతుకఁజాలుట సున్నయా । భవ్యచరితుఁ
బాసి చరియించునట్టి ని । ర్భాగ్యుఁడయ్యొ
రాముఁడేలను బుర మేల । రాజ్యమేల?

జరిగినవన్నియు క్షణభంగురంబులయ్యె. (పైకిఁజూచి) అయ్యో! తెల్లవాఱుచున్నది. హా! హతవిధీ! ఇఁక నాసోదరుఁడు నాకు లభింపకుండును గాఁబోలును. ఓ ఆదిత్యా! నీకును యీ రాముఁడు శత్రువర్గములోనివాఁడయ్యెనా? ఇంత కాఠిన్యమా! అగును. నిర్భాగ్యుల యెడ నేరికిఁ గనికర ముదయించును? (క్రోధముతో) నా ముద్దుల తమ్ముఁడే నాకు లేనివేళ యీ సూర్యచంద్రులేల? ఈ లోకమేల? ఓరీ! నిశా!

చ. ఇనకులవంశ సంభవుఁడు । యీగతి మూర్ఛను జెందియుండ నీ
కనువగునే చరింప నిటు । ఆగుమిదే నిను యంతమొందగా
కనుపడకుండఁ గూల్చెదను । కావఁగ జాలెడు వారలుండరే
వినయముఁ దోప వేడ మది । వింతగఁ దోఁచెను కాచుకొమ్మికన్,

నాబాణ మమోఘమని యెఱుంగవు కాఁబోలును.

(అని దిగ్గున లేచి బాణమును సంధించును)

విభీ:—రామా! ఈ తత్తరపాటేమి? హనుమంతుఁడు ద్రోణాద్రిఁ గొనివచ్చుచున్నవాఁడు. అదియే యీకాంతి. అంతియేకాని యేపాపమెఱుఁగని భానుని రూపుమాపనేల? ఇది ధర్మమగునా?

రాము:—ఏమి! హనుమంతుఁడే వచ్చుచుండెనా?

[ప్రవేశము—ద్రోణాద్రిఁగొని హనుమంతుఁడు]

రాము:—(హనుమంతుని కౌఁగలించుకొని) భక్తాగ్రేసరా! ఆనాఁడు సీతజాడల దెలిపి జీవములఁ గాపాడితివి. నేఁడు సోదరునిఀ జేర్చి సంతసమును జేర్చినాఁడవు. నీమేలును మఱువఁగలనా?

హను:—ఇంతయుఁ దమకటాక్షమే కాని వేఱొండు కాదు.

సుగ్రీ:—సుషేణా! కర్తవ్యముఁ జూడుము.

(సుషేణుఁడు విశల్యకరణిఁ గొని లక్ష్మణుని నాసికకడనుంచ లక్ష్మణుఁడు మూర్ఛను దేఱును. అందఱును సంతసాంబుధి నోలలాడుదురు)

లక్ష్మ:—అగ్రజా! ఆ దుష్టదానవుఁ డెందుండెను?

రాము:—(చేరదీసి) సౌమిత్రీ! నీ వీ హనుమంతుని ప్రేమచే పునర్జీవితుఁడవైతివి. (తెరవంకజూచి) ఓరీ! రావణా! పాఱిపోవుట యేల? రమ్ము. రణరంగమున నెదురై నిలువుము.

(తెరలో)

రావ:—మీ రక్తపానమునర్పక యీ రావణుఁడు మిమ్ముల వీడి చనువాఁడుకాడు. ఇదే వచ్చుచున్నాఁడ.

[రావణుఁడు ప్రవేశించును]

రాము:—లక్ష్మణుఁడు మూర్ఛిలినంతనే జయమందితి నని పొంగుచుంటివా? ఇదే కాచికొమ్ము. (అని బాణములు వదలి) అయ్యో! ఎన్నివిధములఁ బ్రయత్నించినను నిరర్థక మగుచున్నదే వీనిని సంహరించుట కల్లయగును. ఏమి! ఈతనినాసుర్ధ్యము. విభీషణా! ఎందఱికైన జయించితిని కాని యీ రావణుని గెల్చుట దుస్సాధ్యము. శిరములు దునిమినకొలఁదిని తిరుగ నెప్పటియట్టులఁ గూడుకొనుచున్నవి.

విభీ:—రామా! ఈతనిహృదయమున నమృతకలశ మున్నది అది యున్నంతవఱకు జయింప నెవ్వరికిని శక్యము కాదు. ముందుగ దాని నాగ్నేయాస్త్రమున దగ్ధము సేయవలెను.

రాము:—అట్లే చేసెదంగాక.

(అని యాగ్నేయాస్త్రమును బ్రయోగించును)

రావ:—హా! దురాత్మా! విభీషణా! రహస్య మెఱింగించితివా? దుఃఖము. దుఃఖము. (అని క్రిందబడి మృతినొందును)

విభీ:—(రావణునిపైబడి) హా! సోదరా! శ్రీరామచంద్రునితో పోరాటము వలదని నుడివిన వినక, మూర్ఖచిత్తుఁడవై తుద కీగతి బ్రాణములఁ గోల్పోతివా? దనుజేంద్రా! ఎట్టి పరాక్రమమున్న నేమిఫలితము? సీతామహాదేవి నేల చెఱబట్టితివి? ఎందఱు నీ శ్రేయము గోరి హితములఁ బల్కినను యవన్నియుఁ గల్లలని యెంచితివే. ఇప్పుడేమి యనుభవించితివి?

రాము:—విభీషణా! విచారించ నేల? ఈతఁడు నిక్కముగ స్వర్గలోకసుఖము లందఁజాలును. దహనాది క్రియలొనర్పుము. (లక్ష్మణునివంక గాంచి) లక్ష్మణా! నీ వేఁగి యీతని లంకారాజ్యాధిపునిగఁ జేసిరమ్ము.

లక్ష్మ:—చిత్తము.

రాము:—హనుమంతా! సీత కీవృత్తాంతమును దెల్పి రప్పించు యత్నము సేయుము

హను:—మహాప్రసాదము. (అందఱు నిష్క్రమింతురు)

(తెర పడును)

## ఆఱవరంగము—త్రికూటము

[ప్రవేశము—రాముఁడు, సీత, లక్ష్మణుఁడు, సుగ్రీవుఁడు, హనుమంతాది వానరులు]

లక్ష్మ:—అగ్రజా! సీత మహాపతివ్రతాశిరోమణి. సుగ్రీవునితో సఖ్యము సల్పి వాలినిఁగూల్చుట యీ సీతాదేవికై కాదె. వానరసేనఁగూడి శతయోజనంబుల విస్తీర్ణమైన వారధినిఁగట్టుట జానకికొఱకు కాదా? రావణాదివీరులను రణమున దునుముట భూజాత నిమిత్తమే కదా? ఇన్నియు నాచరించి నిష్కళంకమైయొప్పు నీ భూలోకమాతను—సాధ్వీమణిని—సీతాదేవిని అనుమానించుటయా? మీ నామ స్మరణఁ జేయక క్షణమైన కాలముఁ బుచ్చి యెఱుంగని పతివ్రతాశిరోమణియే.

రాము:—లక్ష్మణా! అగును. అన్నియును సీతకొఱకే కాని సీతను చెఱ విడిపించుటకేని తిరుగ గ్రహించుటకు కాదని నమ్ముట. ఎట్లైన నామె యగ్నిప్రవేశము సల్పి దృష్టాంతమును జూపిననేగాని గ్రహింపఁజాలను.

సీత:—(దుఃఖముతో) మఱదీ! లక్ష్మణా! ఏనాఁడు నిన్ను నిష్కారణముగ దూషించి సాగనంపితినో నాఁటినుండియు నా యదృష్టపుదినములు బాసిపోయినవి. లేకున్న నాపతి యేల? నాయెడ రోసమెంచు టేల? నాథా! ఏనట్టి దురాత్మురాలనైన యీ భూమ్యాకాశంబులు నన్ను మడియింపఁజేయవా? దేవతలెల్ల జూచుచు నూరకుందురా? అగ్నిదేవుఁడు నన్ను దహింపకుండునా? మీ పాదముల సాక్షిగఁ బల్కుచుంటిని. మీ నామస్మరణ సేతక్క వేఱొండెఱుఁగను

రాము:—తపస్వీ! నీపల్కులు నిష్ప్రయోజనములు.

సీత:—లక్ష్మణా! కాలయాపనమేల? చితిని బేర్పుము.

లక్ష్మ:—(కన్నుల నీరు నింపుచుఁ బోవును)

(సీతయు నిష్క్రమించును)

[ తెరలో ]

సీత:—ఆపద్బాంధవా! ఓ యగ్నిదేవా!

గీ. మానకేవేళ నా విభు । మదిని నెంచి
భక్తిఁగొల్చుచు వీడక । పరగుచున్న
నిష్కళంకనై సతతము । నెగడుచున్న
న్యాయమరసియుఁ జేస్వము । నాధుకడకు.

(అని యగ్ని ప్రవేశమగును)

[అగ్ని ప్రత్యక్షమై సీతను రాముని కడకుఁ గొనివచ్చి]

(24 వ అనుబంధము)

అగ్ని:—ఇనకులతిలకా! శ్రీరామచంద్రా! ఈ సీతాదేవి మహాసాధ్వి. దుష్టసంహార మొనరించి లోకముల కెల్ల నుపకారమును గావించితివి. స్థిరకీర్తిని గాంచెదవుగాక. ఈ పతివ్రతాశిరోమణిని గైకొనుము. (అని వెడలిపోవును)

సత్యము. సత్యము. సత్యము. (అని ఆకాశవాణి నుడువును)

రాము:—(సీతను జేరఁదీసి) కాంతారత్నమా!

ఉ. శంకలు లేవు నా మదికి । సాధ్వవటంచు నెఱింగియున్న నీ
వంకను దీఱు నిందలవి । వారిజనేత్రిని రావణుండు తా
లంకను జేర్చి యుంచెనను । లాఘవమంతయుఁ బాసిపోవ నా
యంకమునందుఁ జేర్చకను । నాపితి నైచుము లోకనిందకై.

ఇప్పుడన్ననో త్రిభువనంబు లొక్కమాఱుగ సీత మహాసాధ్వి. సీత మహాసాధ్వి యని చాటుదురు. విభీషణా! సుగ్రీవాది వానర పుంగవులారా! కైక విధించిన పదునాలుగేండ్ల వనవాసమును నింక రెండుదినంబులకుఁ బూర్తియగును. భరతుడు వనవాసానంతర మొక్క

క్షణమైన మా రాకలేక ప్రాణముల భరియింపఁజాలనని శపథమూని యున్నాఁడు కాన నీ లోపుననే యయోధ్యకుఁ జేరవలయును. మీ రెల్లరు నయోధ్యకువచ్చి కొన్నిదినంబు లచ్చటనుండి సంతసమును గొల్పుదురుగాక! మనము రేపటిదినముననే బయల్వెడలవలెను. మీ యందఱి సహాయంబున, నడుమ పడుచు నెన్నికష్టము లొదవినను తుదకు సంతసమునఁ బురికిఁ జేరనుంటిని.

అంద:—మహాప్రసాదము.

(అని నిష్క్రమింతురు)

(తెర పడును)

---

రంగము—అయోధ్యాపురమందలి రాజసౌధము

---

[శ్రీరాముఁడు సీత లక్ష్మణ భరతశత్రుఘ్నులు విభీషణుఁడు సుగ్రీవాది వానరవీరులు వసిష్ఠాదులు ప్రవేశింతురు]

రాము:—సోదరా! భరతా! నీ సోదరభక్తి యపారము. ఇంతదనుక జటావల్కలధారివై పురమునకైన రాక నందిగ్రామము నందే యుండి పాదుకలమూలమున రాజ్యమొనర్చుచుంటివా? నీయట్టి తమ్మునిఁ గనినందుల కెంతటిధన్యుఁడనోకదా!

(అని కౌఁగలించుకొనును)

భర:—అగ్రజా! మీతో నడవుల సంచరించు లక్ష్మణునివలె సేవఁజేయుభాగ్యము లేకపోయెనుగదా! ఇఁక తామీ రాజ్యభారమును జేఁబూనుఁడు.

(అని పాదుకల నర్పించును)

రాము:—మంచిది.

వసి:—రామా! రఘుకులసోమా! పట్టాభిషేకమహోత్సవమునకు ముహూర్తము సమీపించినది. శీఘ్రమే రావలయును.

రాము:—చిత్తము.

అందఱు:—గురువర్యా! కానిండు. కానిండు.

వసి:—(కిరీటమును గొని)

సీ. ఎవ్వాఁడు సృజియించె । యిన్నిలోకంబుల
కర్తయెవ్వాఁడగునె । కలచిమాఁడ
భూభారమునుదీర్ప । భువిని మానవకృతి
నవతారపురుషుఁడై । యలరునెవఁడు
దుష్టులఁ బరిమార్చి । శిష్టజనులఁబ్రోచి
మితిలేనిఖ్యాతిని మొలగునెవఁడు
దశకంఠు దునుమాడ । తాపసిపగిదిని
వనములఁ జరియించి । వరలెనెవఁడు

గీ. అట్టి పరమాత్ముఁడీరాము । డఖిలశుభము
లందుచును రాజ్యసౌఖ్యంబు । లంది యికను
వరముఁగొసగుచు భక్తుల । వంతదీర్చి
వరలుగావుత సతతము । వసుధనింక.

(అని కిరీటము రాముని శిరముపై నుంచును)

అంద:—తథాస్తు. తథాస్తు.

రాము:—మహాత్మా! ఎంతయు ధన్యుఁడను. అయిన నిట్లగుగాక.

—:భరతవాక్యము:—

గీ. ధర్మమార్గము వదలక । ధరణినెపుడు
ప్రజలు సుఖమున భక్తిని । వరలుగాత
పాలితుల పోషణార్థమై । పరమదయను
పాలనంబున రాజులు । పరగుగాత.

అందఱు:—తథాస్తు.

(అని మంగళహారతిని బాడుచుండ తెరపడును)

సంపూర్ణము.

---

# అనుబంధములు

## 1 వ అనుబంధము

### శ్యామరాగము—ఆదితాళము

ప॥ ఇటులనుట న్యాయమా! మనోహరా!॥ ఇటు॥

అ॥ ప॥ పటుతరమగు భాగ్యభోగ్యములు పడతుల కేలా?॥ ఇటు॥

1 చ॥ నిజనాథుని సేవల నే-నియతితోఁ జేసికొనెడి
స్త్రీజనమునకు వేఱు-భాగ్యమేమిగలదు నాథా!॥ ఇటు॥

2 చ॥ నాథునితోడిదే-నాతిజీవనము
యీ ధనధాన్యములతో-యింతుల కేమి పని॥ ఇటు॥

3 చ॥ మహిత పాతివ్రత్య-మహిమాన్వితలగు మగువల కీ
యిహలోకంబున నాథునికంటె-వేఱేదైవముగలదే॥ ఇటు॥

## 2 వ అనుబంధము

### కల్యాణిరాగము—ఏకతాళము

ప॥ జననీ! నీవిట్టులనుట తగునే॥ జన॥

అ॥ ప॥ తల్లీ! తల్లీ! యని పిల్చెడి నీతనయుని॥ జన॥

1 చ॥ పితృసమో జ్యేష్ఠయను-పెద్దలపల్కు వినవే
యాతని సత్నీమణి-యమ్మగాదె మఱదులకు॥ జన॥

2 చ॥ శ్రీరాముఁడు తండ్రియనుచు-సీతయె నీతల్లియని కు
మారా! సేవింపుమటంచు-మాతయాజ్ఞ యొసఁగెగా॥ జన॥

3 చ॥ మాతాజ్ఞ యటుండనిమ్ము-మావిధి మేమెమఱ
నోతల్లీ! నరకబాధ-లోర్వఁగలమె తలఁపుమో॥ జన॥

## 3 వ అనుబంధము

### ఝిల్లాంరాగము——ఏకతాళము

ప॥ ఎట్టిపాపపు మాటవింటిని॥ ఎట్టి॥

అ॥ ప॥ నా-చె-వు-లా-రా-నే॥ నెట్టి॥

1 చ॥ వదినయనఁగ తల్లియనుచు-భావించుచు నామది
సాదరమున సేవించెడి-నేనీదినమున నయ్యో నే॥ నెట్టి॥

2 చ॥ గుంజెప్రీలదే-తనువు మంటఁగల్వదే
ఛి-ఛీ-యీ-బ్రదుకిఁకేల॥ నెట్టి॥

## 4 వ అనుబంధము

### అరభిరాగము——అటతాళము

1 చ॥ అమ్మా! నన్గన్నతల్లి కన్నా-మిన్నాగ నిన్ను
నెన్నుకొనుచు నున్న న-న్నిట్టులనుటతగునా?॥ అమ్మా॥

2 చ॥ లక్ష్మణుఁడనఁగా-క్రూరరాక్షసుడని తలఁచితివే
మీా తన్నపుత్రీ! నీముద్దుబిడ్డఁడనుచుఁ దలఁపకనో॥యమ్మా॥

3 చ॥ శ్రీరాముని గెల్చునట్టి-చెనఁటి యసురుఁ డెవఁడమ్మా!
యోరామా! నీవెటిఁగియు-నిట్టులనుట తగదమ్మా॥ అమ్మా॥

## 5 వ అనుబంధము

### సింహేంద్రమధ్యరాగము——ఏకతాళము

ప॥ నాకోర్కె- ఫలియించె నీనాటికి॥ నాకో॥

అ॥ ప॥ యీనాటికి-నాభాగ్యమున॥ నాకో॥

1 చ॥ జగదేకరూప-సౌందర్యరాశి యైన
జానకి యొంటరిగా-లభియించుటచే॥ నాకో॥

2 చ॥ మారీచుమాయచే-మనుజులగు రామలక్ష్మణులు
యీరామ నిచటవిడచి-వెడలుటచే॥ నాకో॥

3 చ॥ శూర్పణఖాపరాధమము-సురిగిపోవునటుల
కార్పణ్యాముదీర నీ-గజగామిని దొరకుటచే॥ నాకో॥

### 6 వ అనుబంధము

ముఖారిరాగము—అటతాళము

ప॥ లక్ష్మణా! నిను నిందించేసితి॥ లక్ష్మ॥

అ॥ ప॥ నిను నిందించేసితి-ఘనబాధలందితి॥ లక్ష్మ॥

1 చ॥ మఱచితిలక్ష్మణా! నీమాట వినమిచే
క్రూరరాక్షసుని-బారిఁజిక్కితిని
నేరమెంచకుము-సహోదరునితోఁ
జేరరమ్మ-నన్నుఁ బ్రోవరమ్మ శీఘ్రమున్మా॥ లక్ష్మ॥

2 చ॥ నీవు లేమిచే యీ-నిశాచరునకు
కినుక్రూరుఁడై-దుర్మదాంధుఁడై
కౌగిలఁజేచుచుండె-నను గావరావె నా
నేరము సైరింపలేవా?-నిన్ను వేడుకొందునో॥ లక్ష్మ॥

### 7 వ అనుబంధము

ఫరజురాగము—అటతాళము

ప॥ ఎందుఁబోయితివే-ధరణిజాతా!॥ ఎందు॥

అ॥ ప॥ ఇందెందైన వెదకిన-సుందరిగాన్పింప॥ వెందు॥

1 చ॥ వలదంచు వేడిన-జలజాక్షి నాపల్కు
లలనా! విన కిట్టు-లపేక్షలకరుదెంచిన నీ॥ వెందు॥

2 చ॥ ఏక్రూరరాక్షసులు-యేరీతి నిన్బట్టి
యేమేమి జేసిరో-యెఱుగంగలేనైతి॥ నెందు॥

3 చ॥ స్వయముగ నీవెంట-జనుచుండు మెఱుగవు
యీయడవుల నిన్నెవ్వ-రయ్యో! దొంగిలినారో॥ ఎందు॥

## 8 వ అనుబంధము

### బ్యాగ్ రాగము—త్రిపుటతాళము

ప॥ సోదరా! ఇది నిశాచరుని మాయయే॥ సోద॥

అ॥ ప॥ ఈమాయఁబన్ని జానకినటు మాయఁజేసి
యేమెఱుంగనట్టు-లెచట నేడాఁగియుండు॥ సోద॥

సాకీ॥ ఆదనుజాధముఁ డెవ్వఁడో
యరసివాని బిల్కు-మార్చి
యవనిజాత యిమ్మల దొలఁగించి
అతివనోముట తమవిధి॥

మిశ్ర॥ మారీరీతిని-చింతించుట మేలుగాదు
క్రూరదనుజుఁడెవఁడో-యెఱుఁగుట ముఖ్యమయ్యా॥ సోద॥

## 9 వ అనుబంధము

### కల్యాణిరాగము—అటతాళము

ప॥ వింటే లక్ష్మణా!॥ వింటే॥

అ॥ ప॥ ఈజటాయు పల్కుల నిపుడీవు॥ వింటే॥

1 చ॥ లంకాధిపతియనసీతను ని-శ్శంకమెయిఁగొని
లంకకేగెనట-అయ్యో! జటాయుపల్కులు॥ వింటే॥

2 చ॥ మనజనకుని హితుఁడట-మనకును పితృతుల్యుఁడు
వినుమీ జటాయుపల్కులు-మనకై రణమొనర్చెను॥ వింటే॥

3 చ॥ కన విహగేంద్రుండైనను-మనయందలి ప్రేమచే
దనుజునితోఁ బోరి గతించెడి-జటాయుపల్కులు॥ వింటే॥

4 చ॥ ప్రాణములన నాసలేక-పాపాత్ముని జంపఁగోరి
ప్రాణములను నసురకిచ్చె-పాప మీతనిగంటే॥ వింటే॥

## 10 వ అనుబంధము

జంఝూటిరాగము—ఏకతాళము

ప॥ వాయుసుతా! ఈ బ్రదుకు బ్రతుకు టెట్టుల

అ॥ ప॥ పలుబాములకోర్చి యీ నగముపైననో॥ వాయు॥

1 చ॥ సోదరుడను ప్రేమలేక-న్యాయాన్యాయంబులేక
యా దౌర్భాగ్యుండగు వాలి-దుర్మదాంధుండై బాధించెను॥

2 చ॥ ఏనాటికైన-నా-యీ-యిడుమలు తుదముట్టి
నానాసౌఖ్యములందెడి-ప్రాప్తము లభియించునే॥ వాయు॥

3 చ॥ ఆలినిగోల్పోతిని-అయ్యో-పరాభవమందితిని
ఏదియెట్లున నా-నాలిని మరిబొందఁగలనే?॥ వాయు॥

## 11 వ అనుబంధము

ఖరహరప్రియరాగము—ఏకతాళము

ప॥ అయ్యో! మనోహరా!

అ॥ ప॥ రామబాణమున నీ-ప్రాణములను వీడితే॥ అయ్యో॥

1 చ॥ ప్రాణపదముగ నీవు-పరిరక్షించిన
సూనుడంగదునివీడి-శోకాబ్ధిని ననుముంచి॥ అయ్యో॥

2 చ॥ మాగతి మరియేమిజేసి-మము బాసితివి
జగదేకశౌర్యధుర్య-సాహసౌదార్యధుర్య॥ అయ్యో॥

3 చ॥ సుగ్రీవుని మాయగనక-యాగ్రహమున వానిదాకి
నిగ్రహింపలేకనిలో-నీల్గితే శ్రీరామునిచే॥ అయ్యో॥

## 12 వ అనుబంధము

శంకరాభరణము—అటతాళము

ప॥ రామా! మునిజనవందితశ్యామా॥

అ॥ ప॥ నీ మహామహిమగన నెవరితరము॥ రామా॥

1 చ॥ సృష్టిస్థితిలయ-కారుఁడవౌనిను, ని
కృష్ట మతినుతియింపఁగల నే-దయజూడుము॥ రామా॥

2 చ॥ శ్రీమన్నారాయణా-ఆర్తత్రాణపరాయణా
రామా! భవతారణ రామా! పాపవిమోచనశ్యామా॥ రా॥

3 చ॥ ధర ముల్లోకములకు-మూలపురుషుడనీవే
శరణు శరణు సైరించుము శ్రీ॥ రామా॥

## 13 వ అనుబంధము

### రాగమాలిక — అటతాళము

ప॥ కల్యాణరామా! కాపాడరావా!

అ॥ ప॥ నీపదరాజీవములు-గొల్చుచుంటినిగాదా॥ కల్యా॥

1 చ॥ నినుజూచెడుప్రాప్తము-సీతో మాటాడెడిభాగ్యము
గనుగొనగలదే-కామితమందార నీ కల్యాణికి॥ కల్యా॥

2 చ॥ మాయలేడియనుచు మదిని దలపక
నా యభాగ్యత్వమున గోరితి దానిని
నాయభిలాషను దీర్ప మీ రరుగగాను
యీయభాగ్యను నినుబట్టి గాపాడవె శ్రీరామా॥ కల్యా॥

3 చ॥ మఱదియను నభి-మానము లేకనె
కాఱులఱచి యతని-నటుబంపివైచి
దారుణబాధల-దగిలితి నొగిలితి
చేరిబ్రోవవె నీసతిని-భూపాలచంద్ర॥ కల్యా॥

4 చ॥ నీపావనవదనంబును-నింపారగాగాంచెడి
ప్రాప్తము నా కెన్నడు-ప్రాప్తించునో

పాపిరావణుని-బాధ దొలగు జెపుము
రూపింపలేక యేడ్చుడి సతిబ్రోవవె, కన్నడసేయక|| కల్యా||

5 చ|| నీమోమునుజూపి-నను-నీప్రాపు జేర్చి
నామనోవ్యధ రూపుమాపి-నన్నోమి
ప్రేముడినాదరించి-ప్రేమబ్రోవరావె
కామితమందారా!-మాహానాకారా|| కల్యా||

14 వ అనుబంధము

అసావేరిరాగము—త్రిపుటతాళము

ప|| అకటా! దైవవిధ దాటతరమే||
అ|| ప|| యెంతెంతటివారికైన-నియ్యలలో|| నక||
1 చ|| మూల్లోకములకు-మూలపురుషుండైన
నల్లలితాంగుని-సాధ్వమణియే యిడుముకులోనయె|| అక||
2 చ|| ఘనపతివ్రత లీ-గతికిష్టముబడుచుండ
గనుగొనతరమే-కన్నులారగ నయ్యో|| అక||
3 చ|| రామునానతియున్నచో-రావణు బరిమార్చి
సేమముగాసీతను-జేర్చియుందు రామునిదరి|| అక||

15 వ అనుబంధము

భైరవిరాగము—అటతాళము

ప|| విశ్వసింపుమమ్మా! లోకైకజనని నాపల్కు|| విశ్వ||
అ|| ప|| శ్రీరామదూతనని దెల్పుచుంటి|| విశ్వ||
1 చ|| సుగ్రీవబంటును- శ్రీరాముదూతను
నిన్నుగాంచవచ్చితిని-కన్నులార గనుగొంటిని|| విశ్వ||
2 చ|| వాయుపుత్రుడను-హనుమంతుండభిదానము
ఓ యుర్వీసుత దయజూడుము భక్తుని|| విశ్వ||

## 16 వ అనుబంధము

ఆనందభైరవిరాగము—ఏకతాళము

ప॥ రామా! దశరథరామా! సద్గుణస్తోమా!

1 చ॥ నీపదంబులనె-నెమ్మదిదలంచెడి

నీ పావనమూర్తిని విలకించెడి ననుగావుము॥ రామా॥

2 చ॥ పాపవిమోచనరామా! భక్తపోషణనామా!

నీ పావనదయచే-నెమ్మిగాపాలుము నను॥ రామా॥

3 చ॥ కరుణాకర! నీనామ-సంస్మరణముచే

దురితము తొలగును-తొలగును కష్టములు॥ రామా॥

## 17 వ అనుబంధము

ధన్యాసిరాగము—అటతాళము

ప॥ అయ్యో! అంజనీదేవిముద్దుకుమారా!

అ॥ ప॥ క్రూరరావణునిచే నేమయిపోయితో॥ అయ్యో॥

1 చ॥ శ్రీరాముని చెంత జేరగ నరుగక

క్రూరరాక్షసులచేతి కేలజిక్కితి॥ అయ్యో॥

2 చ॥ వనమెల్లపాడుజేసి దనుజాధములను

దునుముటతగునే-దూతకోకుమారా॥ అయ్యో॥

3 చ॥ వాలమునకు నిప్పంటించిన-పాపము నీగతియేమయ్యెనో

లీలపతివ్రతనైనయెడల-నీకు బాధలేకుండుగాత॥ అయ్యో॥

## 18 వ అనుబంధము

హంసధ్వనిరాగము—ఏకతాళము

ప॥ చూచి వచ్చితి రాఘవా!

అ॥ ప॥ సీతామహాసాధ్వీమణిని నే॥ జూచి॥

1 చ॥ దశకంఠుని శోకవనములో - సతతంబును జింతించుచు
మీనామమె మదినెంచుచు - మిమ్మె భజియించెడి తల్లిని॥ చూ॥

2 చ॥ క్రూర రావణుండు - కోరి పలుమార్లామెను
జేరి వేధించుచుండ - చింతచే తపియించు తల్లిని॥ చూచి॥

3 చ॥ దుష్ట రాక్షసినుల మధ్య - కష్టముతో గూర్చుండి
దుష్ట వాక్యముల వినుచునే - దురపిల్లెడి నాతల్లిని॥ చూచి॥

19 వ అనుబంధము

కాంభోజిరాగము—ఏకతాళము

ప॥ శరణు శరణు శరణు శ్రీరామచంద్రా!

అ॥ ప॥ కరుణింపుము నాథ భక్తుని గాపాడుము దయతోడుత॥ శర॥

1 చ॥ పతితపావన - భక్తసుపోషణ - పావనచరణా
గతి నీవేయని నీపద - కంజములను వ్రాలితి॥ శర॥

2 చ॥ జాతికి దనుజుడనని - సంశయింపకు మో దేవా!
జాతితోడం బనియేమి - సామీ! నీభక్తునిగా పాడుము॥ శర॥

3 చ॥ నిను మనసారగ భజి - యించెడి భక్తులగనుగొని
ననవరతమును బ్రోచుచుండువని వింటిని దేవా॥ శర॥

21 వ అనుబంధము

కల్యాణిరాగము—అటతాళము

ప॥ ఎటులైనమంచిదే సోదరా! మన॥ ఎటు॥

అ॥ ప॥ శ్రీరామునితో బోరుట మన॥ ఎటు॥

1 చ॥ పరమేశ్వరుడైన యా - పావనచరితునిచే
మరణముగల్గిన మనకు గావలసినదేమి॥ ఎటు॥

2 చ॥ భండనమున శ్రీరాముని - దండిమగలమై గెల్చిన
నిండుకీర్తి గడియించి - నెగడుచుండు టాయుర్విని॥ ఎటు॥

3 చ॥ పరమేశునిచేజచ్చిన - పుణ్యాలోకములుగల్గును
పరమేశున గెల్చినచో - ముల్లోకము లేలవచ్చు॥ నేటు॥

21 వ అనుబంధము

ఖరహరప్రియరాగము——త్రిపుటతాళము

ప॥ మనవి వినుము నామనోహరా!

అ॥ ప॥ పదములంటి వేడుకొందు - ప్రణుతిజేతు దయను॥ మన॥

1 చ॥ శ్రీరాముఁడు దేవుఁడని - చెప్పుచుండె ముల్లోకంబులు
యారాముని తోసమరమా-అయ్యో! నిను ప్రార్థింతును॥మ॥

2 చ॥ మారీచసుబాహుల - మట్టుబెట్టజాలెను
నారాచంబున తాటకి- నిట్టి నరకంబునకంపెను॥ మన॥

3 చ॥ ఖరదూషణాదుల - ఖండనగించెను
పరశురాముని గర్వ - పరిహార మొనర్చెను॥ మన॥

4 చ॥ అట్టివాని యిల్లాలిని చెఱ - బెట్టుట మేలగునే
ఎట్టులైన నామెవిడచి - యెలమి నన్ను గాపాడుము॥ మన॥

22 వ అనుబంధము

ఎఱుకులకాంభోజిరాగము——ఏకతాళము

ప॥ పోమెరా! ఈ లంకాపురి పాబగు

1 చ॥ అపరంజిమేడల - యాశోబగు యాసీటు
పాడయ్యె మాపూర్వకర్మంబుచే సకట॥ పోమె॥

2 చ॥ క్రూరుల కేళీతి - గోరిన జయమబ్బు
క్రూరాత్ముల త్రుళ్ళణగెడి - సమయంబరుదెంచెను॥ పోమె॥

# అనుబంధములు

## 23 వ అనుబంధము

ఫీలురాగము—ఏకతాళము

ప॥ అయ్యో! మాకింక నేదిదారీ॥ అయ్యో॥

అ॥ ప॥ శ్రీరామచంద్రుఁడు ఉపేక్షవహించె॥ అయ్యో॥

సాకీ॥ ఏమునేర మొనరించితిమో

మేమేమిదోష మొనరించితిమో

మేమవిధేయతతో నడచితిమో

మిత్ర॥ కారణమేమొ-యెఱుఁగరాదు-కంజాక్షుఁడు

కినుకవహించె-నేమిటదీరునో-యేమో॥ అయ్యో॥

## 24 వ అనుబంధము

ప॥ ప్రాప్తమెన్నటికి దొరకునో॥ ప్రాప్త॥

అ॥ ప॥ శ్రీరామచంద్రుని పదనారవిందమును జూచు॥ ప్రాప్త॥

1 చ॥ నామనోహరుని-పదపద్మమును

నామనసారగ గాంచెడి-ప్రాప్తమెన్నటికి దొరకునో॥ ప్రాప్త॥

2 చ॥ కాలకర్మవశమున నీ కలుషాత్ముని చేతులలో

చాలక చిక్కితి-కర్మతీరకుండ-గడచు నెకష్టము॥ ప్రాప్త॥

3 చ॥ క్రూరరావణుఁడు-మడియుటయ్యె

చేరువయ్యె గడువు-చెఱవీడి సుఖము॥ ప్రాప్త॥

## 24 వ అనుబంధము

హంసధ్వనిరాగము—అటతాళము

ప॥ శ్రీరామచంద్రా! యినవంశోద్ధారా!

అ॥ ప॥ పావనచరితా! పతిత-పావనచరితా॥ శ్రీరా॥

## లంకాదహనము

1 చ॥ ఈమహాసాధ్వీమణి చరితం
బీరేమలోకంబుల కెఱుకబడియె
పావనమందార-పాలించుకొమ్మయ్య॥ శ్రీరా॥

2 చ॥ ఈనెపమున రాక్షసులను
యిట్టెవధించి లోకంబుల
సాదరమతి నేలితివి గుణ-నాగర॥ శ్రీరా॥

## మంగళహారతి

కల్యాణిరాగము—ఏకతాళము

ప॥ మంగళం శ్రీరామచంద్రా! నీకిదె మంగళం
అ॥ ప॥ మంగళ మమరేంద్రవందిత-మాధవా! ధవా!॥ మంగ॥

1 చ॥ దశరథనందన-పాపవిమోచన
పావనగుణఘన-పాలితశుభజన॥ మంగ॥

2 చ॥ ముల్లోకంబుల కాధారుండవు
సల్లలితాంగా-సల్లలితాంగా-సాధ్యమెపొగడ॥ మంగళ॥

11·

# సంగీత సావిత్రి

అయినాపురపు సోమేశ్వరరాయకవి కృతము

సావిత్రి సకలమానవ నారీమణులలో శిరోమణి. భర్తకు రాను న్న ఆపదల బాపుటలో మేలుమణి. సద్గుణములలో సుగుణఖని, యముని బాధ లోర్చుటకు సాధుసంపన్మణి, నిజతపోమహిమచే నాథుని బ్రతికించి, నారదుడు వలదని చెప్పినను వినక తల్లిదండ్రుల మాటలు సరకుగొనక, తాను వరించిన వానినే దక్క యన్యుని ప్రేమింపనొల్లని విషయమునందు సతీమణి, నాథుడెంతదరిద్రుడైనను, తానెంత సంప న్నని పుత్రికయైనను, అష్టకష్టములు రానున్నను హెచ్చుపదవి పోను న్నను జంకగొంకు లెరుంగని సాధ్వీమణి, భర్తకు రానున్న ఆపదను గాపి, పోయినరాజ్యమును రక్షించుటలో వీరనారీమణియైన ఈయమ్మ చరిత్ర మొక నాటకరూపముగా వ్రాయబడి చక్కని సొంగ్సులతో అలరారుచున్నది. దీని వెల 1—0—0

## సంగీత శ్రీకృష్ణలీల.

గ్రంథకర్త: చకావధానుల మాణిక్యశర్మ.

ఇందు శ్రీకృష్ణుని జననము కంసవధ ఉలూఖలబంధనము కాళిం గమర్దనము పూతనాసంహారము శకటాసురభంజనము హయమణిగ్రీ వుల శాపవిమోచనము గోపికావస్త్రాపహరణము విశ్వరూపసందర్శనము గోవర్ధనోద్ధరణము ధేనుకాసురవధ మొదలగు పెక్కువిషయములతో సొంగ్సుసహా వ్రాయబడిన చక్కని నాటకము. వెల రు 1—0—0

కొండపల్లి వీరవెంకయ్య

శ్రీసత్యనారాయణబుక్కుడిపో,

రాజమండ్రి.

